మ. అనలం బున్నది నీకుమండలములో నవ్వేఁడి లేకున్న నీ
తనుమధ్యంబున లాంఛనచ్ఛలమునం దద్ధామ ముప్పొంగునో
వనితామానసదేహదుస్సహతరజ్వాలాశిఖావైఖరుల్
గనునో నీయమృతస్వరూపకరముల్ కాకోలకంఠాకృతుల్.

ఉ. ఏమని దూఱుదాన జగదీశ్వర నిన్ను సముద్రనేమిమ
త్స్వామినిగా మహాఘనులఁ గన్నదిగా కమలాసపత్నిగా
సోముని మూర్తిగా యనక చూచెద వాగ్రహదృష్టి నయ్యయో
కామునితల్లిఁ జెప్పెడిదిగాక నృపాలుర నేల చెప్పఁగన్.

ఉ. అత్త సుధాబ్ధిపుత్రికిని నాయనుకోడలికొమ్మ శారదా
మత్తచకోరనేత్రికిని మైత్రియ కాని విరోధ మెయ్యెడన్
హత్తఁగఁ జేయఁ డీధరకు నాదిమభూపతి ప్రజ్ఞ యెట్టిదో
చిత్తజమిత్రశత్రులకుఁ జేయు మహత్తరమిత్రభావముల్.

ఉ. సారసజీవనంబులను సర్వజగజ్జనజీవనంబులన్
నీరసతీవ్రధాములఁ నిష్ఠురతం దపియింపఁజేయఁగా
సారసబంధుశబ్దమును సర్వజగజ్జనబంధుశబ్దమున్
సూరున కింకఁ జెల్ల దనఁ జొచ్చిరి వేసవి నెల్లవారలున్.

ఈపృథుచరిత్రము సంపూర్ణప్రతి యున్నవారు పరిషత్తునకుఁ బ్రతి వ్రాసికొనుట కొక్కసారి పంపఁగోరెదము.

(57) ముక్తిచింతామణి- గ్రం. సం. 539.

ఇది యొక్క వేదాంతపద్యగ్రంథము. మూఁడాశ్వాసములు. కవి అండలూరి మల్లికార్జునకవి- గద్యము. "ఇది శ్రీమదఖిల విద్వజ్జనగేయమాన నరసకవితావిచిత్రాండలూరి శరభనార్యపుత్ర సమధిగతవీరశైవాచారవిధాన మల్లికార్జునాభిధానప్రణీతంబైన ముక్తిచింతామణి యనువేదాంతప్రబంధంబు నందు రాజయోగనిరూపణం బన్నది సర్వంబును దృతీయాశ్వాసము."

ఈగ్రంథమును సృష్టికరణకులజుఁడును ముఖీకాశీపతిపృథ్వీమండలరమణలబ్ధవిభవుఁడు నగు కృష్ణమంత్రి కంకిత మిచ్చెను. ముఖీకాశీపతిపృథ్వీరమణుఁడు శృంగవరపుకోటప్రభువు. శృంగవరపుకోట విశాఖపట్టణమండలములో నున్నది. ఈకృష్ణమంత్రి, పాత్రుని కృష్ణమంత్రి కావచ్చును. గ్రంథప్రారంభము:—

ఉ. శ్రీకుచకుంకుమం బెదను జెందఁగ డెందమునందుఁ జెందున
స్తోకదయారసంబు పయిఁదోఁచె ననం దగుభక్తలోక ర
క్షాకరుఁ డిందిరాధరుఁడు శాశ్వతవైభవలక్ష్మి నిచ్చి సు
శ్లోకుని గృష్ణమంత్రి నతిశోభనదృష్టిఁ గృతార్థుఁ జేయుతన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా- అని- కృత్యాదిపద్యములు విపు
లంబడినవి. ప్రథమాశ్వాసాంతమునందు-

చ. అతిబలభీమ సృష్టికరణాన్వయవార్ధిసోమ కీర్తి గుం
భితకకుబంత బంధుకవిమిత్రవనాంత వనంబు సాధువ
ర్ణితకృతధర్మ షడ్గుణవినిర్జితశాత్రవమర్మ మేరుప
ర్వతసమధైర్య కాశిపతిరాజహితా దృఢకార్యధీమణీ.
ఘనవైభవసాంద్ర సృష్టికరణకులేంద్రా! అను మొదలగునవి కలవు.

క. శ్రీముఖకాశీపతిప్రభు, ధీమండలరమణలబ్ధవిభవైశ్వర్యో
ద్దామముఖనీపంకజనీ, స్వామిస్సృతోకృష్ణమంత్రి సామంతగుణీ.
ఇది ద్వితీయాశ్వాసాదిపద్యము. ఆశ్వాసాంతపద్యములు లేవు.
తృతీయాశ్వాసాదినిగూడ "శ్రీముఖకాశీపతి" యనుపద్యమే కలదు.
తృతీయాశ్వాసాంతపద్యములును లేవు. కవిత్వము మచ్చుచూడుఁడు.

గీ. అన్యసాధనంబు లన్నిటికన్నను, బోధనంబు మోక్షసాధనంబు
పాకమునకు వహ్నిపగిది నీజ్ఞానంబు, గలుగకున్న ముక్తిగలుగ దనఘ.

చ. వెలుచ ఘటాదులందుఁ బ్రతిబింబితమైన నభంబు మార్కిడి లో
నిలిచి యుపాధిసంగతి ననేకవిధంబుల భిన్నమూర్తియై
చెలఁగి శివుండు ప్రొద్దులు నశించినఁ గేవలుఁడై చిదాత్మయై
యలరుటఁజేసి యాశివుని కన్య మొకించుక లేదు చూడఁగన్.

చ. మనసు నివృత్తిగాక లవమాత్రము చిత్తము శుద్ధిగాదు లో
నొనరఁగఁ జిత్తశుద్ధి గనకుండిన జ్ఞానము లేదు జ్ఞానమా
త్మను సమకూడకున్నఁ బరతత్త్వముఁ గానరు తత్త్వ మబ్బకం
గనుఁగొనరాత్మ నాత్మకడగానక ముక్తులుగారు యెవ్వరున్.

శాలివాహన సం॥ అధికఆశ్వీయుజ బ ౧౦ ఆ॥ వరకు మలాల పాపయ్య
వ్రాసెను.

(58) ఆంధ్రకుసుమావళి—గ్రం. సం. 552.

వారణాసి వేంకటరాయకవిప్రణీతము.

ప్రారంభపద్యములంబట్టి కవియుద్దేశము తెలియును.

క. శ్రీకంఠ భక్తవత్సల, లోకైకస్తుత్యనామ లోకాతీతా
శ్రీకలిమికోటపురహర, శ్రీకర త్రిపురాంతకాఖ్య శివశివలింగా !

గీ. పొసఁగ నాంధ్రశబ్దపుష్పంబు లొకకొన్ని, పద్యరూపగుచ్ఛపటలిఁ జేసి
యదియు మీకు మదికి నర్పణచేయుదుఁ, జిత్తజారి దీనిఁ జిత్తగింపు.

గీ. ఆంధ్రకుసుమావళియనునట్టిపేరఁ, దెనుఁగుభేదములొకకొన్ని తేటపఱుతుఁ
గోరి సత్కవిప్రభు లాధారముగను, దేవ నీదగుకరుణచేఁ దెలిసినట్లు.

గీ. ఆంధ్రశబ్దశాస్త్ర మనువార్ధి నేర్పాటు, చేయనోరుల కెట్లు చెల్లనేర్చు
నల్లసానిపెద్ద నన్నయభట్టాది, శబ్దవేత్తలకును జనునుగాక.

గీ. తొలుత సంజ్ఞల నొకకొన్ని దెలిపిపిదప, సంధిభేదంబులొకకొన్ని జాడదెలిపి
శబ్దసంగతు లెఱిఁగినసరణిఁ జెప్పి, యందుమార్గంబుఁ జెప్పెదనరసికొనుఁడి.

ఈకవిగద్యము—

"ఇది శ్రీముద్గాలమసగోత్ర వారణాసిలక్ష్మీనృసింహార్యతనూభవ వేంక టరాయనామధేయప్రణీతంబైన యాంధ్రకుసుమావళి యనుశబ్దశాస్త్రంబు నందు సంజ్ఞాపరిచ్ఛేధ సంధిపరిచ్ఛేద శబ్దపరిచ్ఛేదంబులు సర్వంబును నేకాశ్వా సము" మచ్చుపద్యములు—

గీ. దీర్ఘవర్ణమందుఁ దేరిచూడంగను, సున్న లేనియట్లు నున్నయట్లు
నర్ధబిందు వనఁగ నరసున్న యనఁగను, పేర నిదియుఁ జెల్లు బేర్మిరుద్ర.

క. పుల్లింగశబ్దజాలము, చెల్లు మహత్తులనఁగ మఱి స్త్రీజడపశ్వా
ద్యుల్లసిత శబ్దజాలము, నెల్లెడ నమహత్తులనఁగ నీక్రియఁజెల్లున్.

క. నీవును వచ్చితి వనఁగను, వావిరి మరియొకఁడు వేఱె వచ్చినయట్లే
నీవును జనుమని యనఁగను, భావంబున వేఱె యొకని బంపెదననుట్లే.

"శేనాధిపత్యాం శేషాచార్యులు నల సం॥ జేష్ట బ ౧ లక్ష్మీంవారం సరికి యీకుసుమావళిలో వక ప్రకరణం వ్రాసె నని తెలియగలందులకు సుజను లయినవారిని ప్రార్థిస్తాను" అని చివరనున్నది.

శ్రీరస్తు.

# రసాభరణము.

## ప్రథమాశ్వాసము. *

---

శ్లో. శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతశాంతాఖ్యా రసాః పూర్వైరుదాహృతాః.

సీ. చారుశృంగారరసస్థాయి రతి యగు హాస్యరసస్థాయి హాస మరయఁ
గరుణరసస్థాయి పరఁగ శోకంబు రౌద్రస్థాయి క్రోధమై తనరుచుండు
వీరరసస్థాయి వెలయు నుత్సాహంబు తలఁప భయానకస్థాయి భయము
ప్రకట జుగుప్స బీభత్సరసస్థాయి విపులాద్భుతస్థాయి విస్మయంబు
విమలశాంతరసస్థాయి శమ మనఁగ, నిట్లు నవరసములకు నూహింపఁగలిగి
యుచితస్థాయిభావంబు లతిశయిల్లుఁ, బ్రసవఫలరాసులకుఁ బాదపంబులట్లు.

క. రత్యాది నవకమునకుం, బ్రత్యేకము లక్షణములు పన్నుగ నార్య
స్తుత్యములై హృద్యము లగు,నత్యుత్తమలక్షణముఁ బ్రియంబునఁ దేర్తున్ †

క. తరుణులుఁ బురుషులు నితరే, తరసంభోగేచ్ఛ వెలమి దలకొనఁగాఁ ద
త్పరమతిఁ దివురుట శృంగా, రరసజ్ఞులమతమునందు రతి యన నెగడున్.

— రతికి నుదాహరణము —

ఉ. మారుఁడు రూపవంతుఁడు, హిమద్యుతి చల్లనివాఁడు, రమ్యసం
చారవినోదశీలుఁడు వసంతుఁడు, వెండియు సద్గుణాఢ్యు లు
న్నారు మహీశు లెవ్వరును నాహృదయంబున కింపు గారు నా
కోరిక సర్వసేవ్యుఁ డగు గోకులనాయకుఁడే తలోదరీ.

క. క్రూరత లేని వికారా, కారాద్యము లెచట నైనఁ‡ గలిగిన వేళన్
బోరనఁ దోతెంచు మనో, హారివికాసంబు పేరు హాసం బయ్యెన్.

— హాసమున కుదాహరణము —

ఉ. శౌరి రఘుప్రభుండు రవిజాత పయోనిధి యంచు గోపికల్
తోరపుఁదీఁగెలోఁకలును దోఃపదయానముఁ బూని వానరా
కారమెలర్పఁ దాఁటుచును గంతులు వేయుచుఁ బాఱుతెంచి త
త్తీరనగంబునన్ § శిలలు దెచ్చి గుభుల్లున వేతు రార్చుచున్.

---

*కృత్యాదిపద్యములు లభింపలేదు. † దేల్తున్ ‡ లెచటినైనన్ § తీరనగరంబులన్ (ఇందలి పాఠభేదములు చెన్నపురి దొరతనమువారి లిఖితపుస్తకభాండాగారప్రతినుండి గ్రహింపఁబడినవి.)

క. విధివశమునఁ దనప్రజకగు, నిధనాదులు వినినఁ దనమ నెమ్మనమున న
త్యధిక మగు నెగులు వొడమిన, నధీరమతిఁ బొగుల శోక మపగతశోకా!

— శోకమున కుదాహరణము —

ఉ. అన్న! సభాస్థలంబున దురాత్ముకులై తలపట్టి యీడ్చి రం
దున్న ప్రభుల్ గనుంగొనఁగ నొల్వఁ దొణంగిరి చీర శూరులు
న్నన్ను నుపేక్ష చేసిరి యనాథఁ జుమీ కరుణింపు మిస్త్రు నీ
వన్న వధూటిమాట విని యక్షయ మంటివి నెత్తినూఁచుచున్.

క. ఏపున నితరుల ద్రోహా, లాపాదులు తనమపీనులన్ సోఁకినచో
నేపురుషునిమదిఁ బొదలుఁ బ్ర, కోపజ్వలన మది నెగడఁ గ్రోధ మనంగన్.

— క్రోధమున కుదాహరణము —

ఉ. తిట్టులు పెక్కు సైఁచితి మతి స్మనుజాధముఁ డేలకొవ్వనో
యిట్టులు ధర్మరాజుసభ నెగ్గులు వల్కిన చైత్యకోటి ము
ప్పెట్టులఁ దూలఁదోలు మదభీప్సితదర్శన మీసుదర్శనం
బెట్టులు సేయునో యిచట నిందఱుఁ జూతురుగాక చైద్యునిన్.

క. లోకోత్తరకృత్యంబులు, గైకొని యవి *యెడపకుండఁ గావించుదృఢా
స్తోక ప్రయత్న మది సుగు, ణాకర యుత్సాహ మనఁగ నభినుతి నొందున్.

— ఉత్సాహమున కుదాహరణము —

ఉ. బాణునిఁ గాతునంచుఁ బటుబాహుబలంబున సద్దగించి యా
స్థాణుఁడు దానునుం బ్రమథసంఘముఁ బన్నినఁ బన్నినీ రణ
క్షోణిఁ బరాక్రమస్ఫురణ సూపెద శత్రుని యేపు మాపెదన్
శోణితపట్టణంబు వెసఁ జొచ్చెదఁ ద్రుంచెద దైత్యుహస్తముల్.

క. ఘోరము లగునత్యుగ్రా, కారాదులవలన మనసు కళవళపడఁగా
సైరింపరాక తూలుట, ఘూరయ భయ మనఁగ నెగడు నభయవిధాయీ.

— భయమున కుదాహరణము —

ఉ. మించుగఁ బాంచజన్య మెలమిం గరపద్మయుగంబునందుఁ గీ
లించి నిజాధరోష్ఠమున లెస్సగఁ గూర్చి మురారి లీలఁ బూ
రించిన గుండియల్ వగిలి త్రెక్కొను భీతి నశేషదైత్యులుం
జంచలచిత్తులై నలుదెసం జెడి పాఱిరి తద్ఘనధ్వనిన్.

*యడపకుండ.

# ప్రథమాశ్వాసము.

క. మేదోమాంసాసృక్క, ల్యాదివివిధదుష్టదర్శనాదులవలనం
బ్రాదుర్భవించుహేయం, బేది యది జుగుప్స యనఁగ నెన్నిక కెక్కున్.

— జుగుప్స కుదాహరణము —

ఉ. చిక్కిరి నేఁడు రక్కసులు నీ బలభగ్ననిముష్టిఘట్టనం
బుక్కిటిమద్యముల్ రుధిరపూరము నొక్కటిగా బుగుల్లొనం
గ్రక్కుచు నీరధారఁ దెగి కండలు గుండెలుఁ గీకసంబులుం
దక్కక చిక్కు జీరువడి దగ్గఱ రాలెఁ బూతిగంధముల్.

క. క్షితిఁ గారణంబుకంటెను, వ్యతిరిక్తం బైనయట్టి యభినవకార్య
స్థితిదర్శనచేతోవి, స్మృతి* విస్మయ మనఁగ నుల్లసిల్లు ముకుందా.

— విస్మయమున కుదాహరణము —

చ. కొడుకఁడ వైననీకు నిదె కొస్తనుచున్ సెలవింగరాంగుళం
బిడి భువనప్రపంచము లనేకము లంగిటఁ గాంచె నందులోఁ
గొడుకున కున్నవెల్లి తనకోమలరూపము నొప్పఁ గాంచి య
ప్పడఁతి యశోద నివ్వెఱఁగుపాటు వహించె మనోగతంబునన్.

క. ఎరవగు† సంసారం బ, స్థిరముగఁ గని నిర్వికారచేతనుఁ డగు న
ప్పురుషుని సుఖదుఃఖాద్య, స్మరణము లోకంబునందు శమ మైచెల్లున్.

— శమమున కుదాహరణము —

చ. కటకట! రాజ్య మంత్యనరకం బటె దేవపదంబు లన్నియుం
గుటిలనిశాటభర్జనలకు న్పదనం బటె యింక సౌఖ్య మే
మిటఁ గల దంచు సర్వమును మిథ్యగఁ జూచు బుధాళి లోనిసం
కటములు బాహ్యదుర్దశలుఁ గాఁగు గదాధరరక్షణంబునన్.

క. స్థాయిత్వం బీభావని, కాయంబున కేమిట వ్యాఘాతము లేకు
న్నేయ మగు వెండి యేమిటఁ, బాయక తలకొను రసానుభవ మని రేనిన్.

వ. స్థాయిభావములు సజాతీయ విజాతీయంబులం జెడక దృఢవిభావ సదమ లానుభావ సాత్త్వికభావసంచారికభావముల రసము[illegible]చు నందు సజాతీయ విజాతీయభావము లెట్టి వనిన.

క. అరయ సజాతీయములై, జరగు నిజస్థాయిభావజనితాంతరముల్
సొరిది విజాతీయములై, జరగుఁ బరస్థాయిభావజనితాంతరముల్.

---

*విస్మృతి †ఇరవగు

వ. మఱి విభావం బెట్టి దనిన.

క. చను నాలంబన ముద్దీ, పన మనఁగా ద్వివిధమై విభావము మఱి యం
దున నాలంబన మన్నది, ననుపమసమవాయికారణము రసముకుఁగన్.

వ. మఱియు నిమిత్తకారణం బగు నుద్దీపనవిభావం బెట్టిదనిన.

క. ఇల నుద్దీపన మొకటియు, నలి నాలంబనగుణం బనంగా దచ్చే
ష్టలు నా దదలంకృతి యన, నలరుఁదటస్థములునాఁగనగునలుదెఱఁగుల్.

క. తొలఁగదు కార్యము మొదలం,గలసియుఁజేయు సమవాయికారణమదితాఁ
గలయక కార్యమొనర్చును, నలిఁ దొలఁగు నిమిత్తకారణం బనునది తాన్.

క. అనుభావంబుకటాక్షం,బును భుజవిక్షేపణంబు మొదలగు కార్య
త్వనిరూఢి నుల్లసిల్లును, వినుస్తంభాదు లష్టవిధసాత్త్వికముల్.

క. తగు సంచారము లనఁగా, మొగి నిర్వేదాదిభావములు ముప్పదిమూఁ
డగు రసికులమతమున నవి, జగమున సహకారు లగుచు సన్నుతి కెక్కున్.

గీ. కారణముఁ గార్యమునుసహకారిచయము,నైవిభావాదు లిట్లొగి నతిశయిల్లు
నీసమూహంబు రసములం దెట్లయట్లు*,నడచుఁ బత్త్రరసానుగుణంబుగాఁగ.

ఉ. ఆదట వర్ధమానవిభవాతిశయంబున వార్ధులట్లు ర
త్యాదులు వీచులట్లు దయమా నడఁగుం బెరభావపంక్తి ని
ర్వేదముఖోపభోగరుచివృద్ధిరసం బది నాట్యసంగతిన్
మోదమెలర్ప సభ్యులమనోగతులం†దగు కార్యమై చనున్.

క. రసములవలనరసంబులు, పొసఁగఁగనుదయించునని యుఁబూర్వోక్తమగున్
వసుమతి నొకరసమున కొక,రసమువిరసమనియుఁ జనుపురాకృతకృతులన్

సీ. శృంగారమునఁబుట్టెఁజెచ్చెరహాస్యంబుగలుగురౌద్రంబునఁగరుణ మఱియు‡
వీరంబువలన భావింప నద్భుతమగుఁ బటుభయానకము బీభత్సఁ బొడముఁ
బరఁగు శృంగారబీభత్స లొండొంటికి హాస్యంబుఁ గృపయునన్యోన్యరిపులు
రౌద్రాద్భుతములు పరస్పరద్విషులు మిథ్యాహితు లీవీరభయానకములు
త్రివిధలక్షణములగ్గి దీపించు నన్నియు, రూపమునఁ దలిర్ప యీపరసము
వాక్ప్రవృత్తిదోఁప వాగ్రసంబగుఁ గ్రియ,లందుఁగానఁబడుఁ గ్రియారసంబు.

సీ. శృంగారముత్పలాంచితమువిష్ణుఁడురాజు1 తెలుపుహాస్యముగణాధిపుఁడుభర్త2
కరుణ కపాయంబు కాలుఁ డేలిక రౌద్ర మవ్యక్తరాగంబు హరుఁడువరుఁడు

---

*కెల్లనిట్లు †మనోగతులుం ‡రౌద్రమునఁ బ్రఖ్యాతకరుణ గ్గీలక్షణములు 1. భర్త
2. ఱేఁడు.

వీరంబు గౌరంబు విభుఁడు వజ్రి భయానకము ధూమ్రము మహాకాలుఁ డీశుఁ
డసితంబు బీభత్స మధిపతి నంది యద్భుతము పీతము జలజాతుఁడు బ్రహ్మ
వర్ణముల నెల్ల మీఱి యస్వామిపరత, వెలయు నిర్వేదధృతి భావములను శాంత
మిల్లు రసవర్ణముల రసాధీశ్వరులను, గోరి యెఱుఁగుట రసికత గోపకృష్ణ.

క. ఎసఁగం దొమ్మిది విలస, ద్రసములు తత్తదధిదేవతాసహితముగా
రసశాస్త్రకోవిదులమా, నసములకు నుదాహరింతు నవపద్యములన్.

శృంగారరసము—

ఉ. శ్రీకుచకుంభకుంకుమరుచి న్మణిశోచులు వైజయంతికా
స్తోకమరీచులుం గనకశోభితవస్త్రములు న్నిజోజ్జ్వల
శ్రీకి నవీనవిస్ఫురణఁ జేయఁగ గోపవధూసమేతుఁడై
గోకులవీథుల న్మెలయు గోపకుమారుఁ డుదారలీలతోన్.

హాస్యరసము—

ఉ. నిక్కి జటాస్ఫుటస్థలిని దనతొండము సాఁచి పేర్చి యా
చక్కటి గౌరి సూడ నిలఁ జల్లినఁ బెక్కుముఖంబులై చనన్
గ్రక్కున శూలిహస్తదశకంబున నాఁపినభంగి* సూచి మై
గ్రక్కదలంగ నవ్వుచును గంతులువేసె గజాస్యుఁ డుబ్బుచున్†.

కరుణరసము—

చ. హరి నొకనాఁడును గొలువరా బహుబాధలఁ గుంద నుత్తులై
తిరి నరులార దిక్కుగలదే భవదుష్కటశోకబాష్పముల్
పొరిఁ బొరి నేఁటికై మిగులఁ బొంగి సముద్రసమూహంబులయ్యెఁ దే
ప్పరముగ నంచు నారకులఁ బల్కెఁ గృతాంతుఁడు గర్జరంబునన్.

రౌద్రరసము—

చ. కుపితశిఖద్ధిదుగ్గమతఁ గూలుఁ బురత్రయ మిందెఁ గొక యా
త్రిపురనిశాటకోపమునఁ దీటుజగత్త్రితయంబు నొందె సా
విపులపరాక్రమం బొకని వీక్షణ నేర్చునె నాఁగ భూరథం
బపుడు త్రినేత్రుఁ డెక్కె నిశితాస్త్రసువర్ణశరాసనాఢ్యుఁడై.

వీరరసము—

ఉ. స్రుక్కక చక్కనై నిలుపు శూరుఁడ వైనను మార్కొనంగ నీ
వెక్కడఁ బోయెదంచుఁ గడు నేపున వృత్రుని బెట్టి దాఁకె తా

---

* నాఁగినభంగి † డుబ్బున్.

క్రొక్కిన వజ్రధారల నహీనమయూఖము లంతరిక్షమున్
దిక్కులు బిక్కటిల్లఁ నదితిప్రియపుత్త్రుఁ డుదగ్రలీలతోన్.

భయానకరసము—

ఉ. ఆలమునందు ఘోరదనుజావళిఁ గూల్చి నిజాస్యరేఖనా
భీలత దోఁప వాలు జళిపించుచు హుంకృతు లుల్లసిల్లఁగా
శూలికిఁ దత్పరాక్రమముఁ జూపెడు వేడ్క నేగు నమ్మహా
కాళి విజృంభణంబుఁ గనఁ గాలునికైనను భీతిపుట్టదే.

బీభత్సరసము—

చ. దురమున నందికేశ్వరుఁడు దుర్దముఁడై నుఱుపంగ రాక్షసో
త్కరవరగాత్రముల్ మెదిగి కాళ్లును జేతులు నుత్తమాంగముల్
బరులును వీఁపులుం బిఱుఁదుఁ బ్రక్కలు రూపర స్రగ్గి రొంటెకు* మైఁ
బురపుర మ్రింగుచుం† గదురు భుగ్గున నామట నున్నవారికిన్.

అద్భుతరసము—

చ. చెలువుగఁ బచ్చిరంటఁ దగఁ జేసిన కుందనుదేహ మందులో
జల మనలంబు నాయనలసంఘము మీఁదట నోలివాయు వి
‡ట్టలముగ నొక్క బట్టబయటం బదిలంబుగ నిల్పి పెక్కురూ
పుల సృజియించె బ్రహ్మ తలపోయఁగఁ జిత్రచరిత్రుఁ డెయ్యెడన్.

శాంతరసము—

ఉ. మ్రొక్కిన వెక్కిరించినను మోదిన గందము దెచ్చి పూసినం
ద్రొక్కిన నెత్తుకొన్నఁ గృపతోఁ గుడిపించినఁ బట్టవెట్టిన
న్నిక్కను స్రుక్కు లేక తరుణీజనులందును స్రుఁకులందుఁ దా
నొక్కవిధంబ కా మెలఁగుచుండు మహాత్ములఁ జెప్ప నొప్పగున్.

క. నవరసములయ్యును గా, రవమున శృంగారవీరరౌద్రాద్భుతముల్
భువి లోకోత్తరనాయకు, నవిరళమున నాశ్రయించు నది యెట్లనినన్.

సీ. రసము నాయకసమాశ్రయమువఁ బ్రావీణ్యఁ దగునటు చేష్టల నైనఁ దక్క
థాకర్ణనంబున నైన సామాజికప్రకరానుభావ్యమై పరఁగుచుండుఁ
బరగతంబయ్యు సద్భావనచే రసోదయవిశేషము విరుద్ధంబు గాదు
మఱియు మాలత్యాదిమహిళాప్రసంగంబు వినుచు సభ్యులుగ్రీ నిజవనితలందుఁ

---

*రొంటిమై †బొంగుచున్ ‡ట్టలముగ నొక్క బయిటం బదిలంబుగ నిల్పియు వాని పెక్కురూ. శ్రీసభ్యుల.

దలఁపు నిలుప* రసాశ్రయత్వంబు గలుగు†
ననుకరణమాత్రమై యుండు నాశ్రయంబు
గాదు, భావకత్వాదులు గలిగనేని
వాఁడు సామాజికులయట్టివాఁడ యగును.

క. ప్రకటనటుఁ డరయ సామా, జకసముఁ డగునేని వానిచే ననుభావా
దిక మెల్లొదవు ననిన వా, నికి నిజ యభ్యాసజనితనిపుణత యయ్యెన్.

ఉ. వాసన నొప్పుప్రేమ మిథువంకల లే కొకవఁ జెప్పిరే
నేసతియైనఁ బల్వురకు నిచ్చయొసర్చుటఁ జెప్పిరేని త
ద్భాసురలీల మ్లేచ్ఛమృగపక్షిగత బుగఁ జెప్పిరే రసా
భాసముగా నెఱుంగుదురు భావకు లిత్రివిధప్రయోగమున్.

వ. అందును.

క. ఆరయ సంజ్ఞాప్రకరణ, మీరీతిఁ దనర్చి వెలయు నిట రసాద్య-
స్ఫారప్రకరణమును శృం, గారప్రకరణము నాయకప్రకరణమున్.

క. నవరసనాథశ్రీనిధి, నవఖండమహీతలంబునకు నొడయఁ డొగిన్
నవనలినాసనజనకుఁడు, నవనిధిసదృశుండు సజ్జనవ్రజమునకున్.

గద్యము.

ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజన
విధేయ అనంతనామధేయ ప్రణీతంబైన రసాలంకారంబునందు‡
నవరసస్థాయిభావంబులును సజాతీయవిజాతీయంబులును
విభావానుభావసాత్త్వికభావసంచారికాభావంబులును
రసజన్మరసవిరోధాదులును సంజ్ఞాప్రకర
ణంబు నన్నది ప్రథమాశ్వాసము.

*నిలుపు †గలదు ‡రసాభరణ మని మాతృకలోను గ్రంథాదిని గలదు.

శ్రీరస్తు.

# రసాభరణము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీయుతుఁడు భక్తలోకమ, నోయుతుఁ డాధ్రువవిభీషణుల నాకల్ప
స్థాయిగ రక్షించిన కరు, ణాయుతుఁడగు ధ్రువపురీశుఁ డధిపతి మాకున్.

క. మును సాధారణరూపం, బునఁ బ్రథమస్థాయిభావముగఁ గ్రమగతిఁ జె
ప్పిన రతికిని సాధారణ, వినుతవిశేషంబు లిచట వివరింపఁదగున్.

మ. రతి దానాయకనాయికాదిపరతన్ రంజిల్లు శృంగారమై
క్షితిలో దేవగురుద్విజాదిపరతం జెన్నొందు సద్భక్తియై
సుతమిత్రాశ్రితసోదరాదిపరతన్ సొంపారు వాత్సల్యమై
మితి చెప్పంగలదే రసస్థితికి బేర్మిం జూడఁగా నెయ్యెడన్.

వ. ఇట్టి శృంగారభక్తివాత్సల్యంబుల కుదాహరణము—

శా. ప్రేమం జూచిరి ప్రాణనాథుఁ డనుచున్ బింబాధరీరత్నముల్
స్వామిత్వప్రణిపత్తిమైఁ గొలిచి రోజం బౌరలోకంబు చే
తోమోదంబునఁ బుత్రభావనఁ గడుం దోతేర నంతన్ ఘన
శ్రీమీఱ న్వసుదేవదేవకు లొగిన్ సేవించి రావెన్నునిన్.

వ. మఱి తత్సజాతీయవిజాతీయంబు లెట్టి వనిన.

క. మొదల సజాతీయం బను, నది విభునకు నాయికాంతరాలోకనమై
పొదలు విజాతీయం బను, నది క్రోధాఖ్యంబు రెండు నహితము రతికిన్.

ఉదాహరణము—

ఉ. ఎన్నఁడు చూచె నన్ను నతఁ డింపుదలిర్పఁగ నాఁటనుండియు
న్నన్నన వెత్తిగాఁడు, పరమ్మానవతీసతిపొంతఁ బోఁడు, ప్ర
చ్ఛన్నవిరోధి మజ్జనని చాయలువాఱఁగ నేమి పల్కినన్
న్నిన్నక పోవుఁగాని తరుణీ మదిఁ గ్రోధము లేదు శౌరికిన్.

వ. మఱి విభావా దెట్టిదనిన.

సీ. పరఁగ శృంగారవిభావంబులందు నాలంబనోద్దీపనలక్షణములు
నాలంబనంబు నాయకనాయికాకృతి రససమవాయికారణము దాన
ఘటకల్పనకు మృత్తికయుఁబోలె వెండి యుద్దీపనమ్మును నాల్గు తెఱఁగులందు
గురుతరాలంబనగుణము లా రూపయౌవనముఖ్యమై చేష్ట లనుభవమున

శ్రీరస్తు.

# సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణమ్.

శ్లో. అస్తి కల్పద్రుమః కోపి జాతరూపలతావృతః
వేఙ్కటాద్రిశిఖారూఢః స్మరతాం పరమార్థదః.

## (1) సంజ్ఞాపరిచ్ఛేదః.

శ్రేయః ప్రమేయవిజ్ఞానమ్.

సిద్ధి శ్లోకతః- తదుపదేష్టా న్వేష్టవ్యః. ఆంధ్రభాషాసంబంధినీ సిద్ధి శ్లోకవ్యవహారా దవగంతవ్యా-తర్హి శాసన మిద మనారంభణీయ మిత్యాశఙ్క్యాహ శాసన మితి.

శాసన మిదం దిక్ప్రదర్శనమ్—అజ్ఞాతదిశం దేశం జిగమిషోః పాన్థస్య మార్గం పృచ్ఛతః పురుషేణ కేనచి దేవం యాహీతి హస్తనిర్దేశేన దిశో దర్శనవ దిదం శాసన మధిజిగమిషూణాం ప్రథమప్రవృత్తా వుపకారకం భవతీ త్యర్థః.

సంస్కృతప్రాకృతే ప్రకృతీ- కేడియము=ఖేటకము; బాడిగ=భాటకము; కడియము=కటకము; వడియము=వటకము; కన్నియ=కన్యక; వన్నియ=వర్ణకము; ఆడియ=ఆఘాటకము.

ఏషా వికృతిః

తత్సమా తద్భవా దేశ్యా చేతి త్రిధా.

అచ్ఛా సంస్కృతసమేతరా

పఞ్చాశత్ సంస్కృతస్య వర్ణాః

ప్రాకృతస్య కతిపయన్యూనాః

అత్ర ద్వివిధా అదిదు ర్వర్ణ్యావైచావచో బిన్దుయుగమ్.

కగచజయుగటడణతదనపబమయరలవ సహాళాస్తు హలః

ఋగ్విసర్గయుఙ్ఙఞశషా స్సంస్కృతిసమయోగినః

కచటతపాః పరుషాః

గజడదబాః సరళాః

ఉభయేఽక్షపాః

హలః పరే స్థిరాః

చస్తాలవ్యే తాలవ్యః

అన్యత్ర దన్త్యః

అక్త్వాదిషు. (కంచంత- కాచాకు-పచ్చా క్త్వాదీనా మక్త్వాదిత్వా త్సాధుత్వ మవగన్తవ్యమ్)

రాజన్యవిభ(క్తౌ)చః)

ఇతో బహువచనే సంస్కృతసమస్యోపధా చోః-(ఇత ఉదన్తస్య ఉపధా తాలవ్యో తాలవ్యా నస్యాతామ్)

తౌ సవర్ణౌ-(దన్త్యతాలవ్యౌ సవర్ణౌ)

విభక్త్యాగమచార్థోనుద్రుతః- (ఆగమ విభక్తిటికాన్తచార్థోనుద్రుతః)

తదిష్టం ద్రుతప్రకృతికమ్
అన్యత్కలా
జతి బిన్దుః
నస్థిరపరః
డుజీట్కః పూర్ణః
హ్రస్వా త్ఖణ్డస్యవా
ఇంకారాంటచుండుషు
పవాదే ర్నిత్యమ్
సర్వత్ర రలసంయోగే సమానపదే.
(రలసంయోగే ఇతికిమ్- మూండ్చు ఇత్యత్ర అతఏవ నపూర్ణః)
నదీర్ఘా త్సాంస్కృః
అన్త్యాక్షరంటేః
అచఃప్రథమా త్సర్వమఙ్గం సమానపదే.
యణాలఘుః (లఘుశ్చ)
ఏజప్లుతో హ్రస్వః
చితోహలో ద్వే
జిత్యచి (జిత్యచి హలో ద్వే)
చితః ప్రథమస్య. (ప్రథమస్యకిం- పుడుచో డస్య మాభూత్, అప్పుడు)
సర్వత్ర సంయోగే సమానపదే-(ఎనమలోమ్మయో ర్నకః పూర్ణబిన్దు ర్నిత్యం స్యా త్తూమా- ఎనమందు ము, తోమ్మందుము.)
ఆశ్వాసాన్తే వివక్షితైకవిభక్త్యా విశేష్యైర్గ్మంగళం కుర్యాత్
తదుపవ్యాఖ్యా విశేషాంతైః
అచః ప్రాణాః
ఏ జ్వక్రః
ఐ జ్వక్రతమః
హలః ప్రాణినః
దయః పరుషాః

జశ స్సరళాః
శేషాః స్థిరాః
నోర్ద్రుతః
ఋవర్ణ రలతుల్యౌ
సమాసే బహులమ్
పాదాద్యక్షరం యతిః
ద్వితీయం ప్రాసః
లగౌ గలౌ వహలా
నహలా సూర్యా
నలనగసలభరతా ఇన్ద్రాః
యాద్యాః ద్విగలాద్యా శ్చన్ద్రాః
వాదయశ్చ గణాః
ప్రత్యయో వర్ణకః
చవర్గయో స్తాలవ్యః
అన్యత్ర దన్త్యః
అనుస్వారా ద్వర్ణకస్య టః (దష్టః)
దోడో న్యతరస్యామ్
నవసతౌ- (నస్థానా ద్దోషో అన్యతరస్యామ్)
ధాతువ జన్యోపి
మహాన్తో౽స్త్రీతిర్యగ్జడాః
పేలపిండిప్రభృతిషుములోపో దృశ్యతే.
కర్తృకర్మ్మణోరభ్యాసస్తత్
నత్రిసంయోగః
ద్విపూర్వలోపదా ల్లోపః
బహువచన ఇతి వక్తవ్యమ్ (అన్యథాంపాలులోపల నిత్యత్ర లత్వాపత్తిః-లోపలనిత్యస్యాత్ర సుప్త్వాభావాత్.)

## (2) సన్ధిపరిచ్ఛేదః.

అచోయ డచః పరా దచి

ఉతోఽచి (ఉత స్సన్ధిః)

విభక్తే రప్రథమాయా బాహుళమ్

చువర్ణకస్య

అతః

ఇతః కిమాదేః

ప్రథమోత్తమయో ర్వా

నిత్యం మధ్యమస్య

న క్త్వః

క్వాపి సవర్ణే దృశ్యతే.

అచో అపదాదా వనాద్యవకోః

ద్రుతలోపే

ఆమ్రేడితే ప్రాయః

ఆకా

కుత్వాదేః టే ష్టుచ్

నిగ్రాడు నిగ్రాయి చెయ్యాదేర్లోపః- పదాదావే వేష్యతే- వాయిగిడి- హాలి బహుళం-

ప్రథమామాత్రా త్పరుషాణాం బహుళం గసడదవాః

నాచ్ఛికా ద్ద్రాసే సాంస్కృతికానామ్

జడసంబోధనకాకుభ్యో వా

సమాస ఇతి వక్తవ్యమ్- (అన్యథా కడునలుకే త్యత్రాపి స్యాత్ - నచ నుకా వ్యవధానాన్న భవతీతి వాచ్యమ్. స్వాఙ్గస్య స్వవ్యవధాయకత్వాభావాత్)

పీచికాపత్రికాభ్యాం పరస్య ద్రోఽత్తరపదే.

పడుగొమ్మలి త్యాదిషు న ప్రతిషేధః ఇతి వక్తవ్యమ్

ఊరుంగాయే త్యాదిషు నుగపి దృశ్యతే.

నిత్యం ద్వన్ద్వే

దీర్ఘా ద్బహుళమ్

కొనుటే రనుప్రయుక్తస్య మః

ప్రతి ప్రకృతికా త్సంజ్ఞాః

కన్యాదిభ్యో ద్రుతలోపిభ్యః పరుషాణాం గజడదవాః- (కన్నెదరి ఇతి వా కన్నిదరి ఇతి వేతి సన్దేహః)

శేషు ద్రుతస్య బిన్దు ర్బహుళమ్

లోపో న్యత్ర

నాచి

ఉతః సుపో వా

సువర్ణకే అనాదేః- మేనోః క్వాపి (పూంబోండి)

నిత్యం సమాసే

న సోదరాదిషు-(ననుకి సోదరాదిషు)

షష్ఠీయి ద్రుతస్య పూర్ణబిన్దు రన్యతర స్యామ్

నచయ శ్చరి వికృతిః

ఊద్ధృతో రందా నుగ్నిత్యమ్

ముక్కుకో ర్వా

నపదాది హ్రస్వా త్ఖిణ్ణాలోపా

వికృతిశ్చ పరుషాణాం ఖరి

ద్రుత స్యాచో వా లోపః

నిత్యం సమాసే

ద్రుతాత్

మధ్యమయో ర్వా

నాచి

కుప్పకాద్వా

సర్వత్రామ్రేడితేముజః-(నిచ్చనిచ్చలు, సారెసారెకు, తేపతేపకు, వారివారికి, వారివారిచేత, తమతమవలన, తడవతడవకు, ఇత్యాదిదర్శనాన్నాస్తిః ఇత్యేవన్యాసః కర్తవ్యః)

కేషాంచి త్తేః

సుపః

కడాదే రాగస్య టచ్

త్రోప్వాదే ల్లోపః- తోద్రోపు, రారాపు, రారాపిడి.

ప్రాస్వే ద్విర్వచనే హల్యాచ్ఛికస్య నిత్యమ్

చః పరసవర్ణః

అనుకృతౌ విసర్గస్య లోపః

హలో ద్వే

దీర్ఘా ద్బహుళమ్

మః

ఓన్నమసో అతః

వువిషయస్య నిత్యం వుక్

నాసన్ధి ర్వాక్యవిరామే దోష ఇత్యాద్యాః

సుక్ప్రత్యేవిభక్తౌ

నిత్య ముద్వృతౌః

జికిషష్ట్యో రచి సమాసే- (కొమ్ముకొనేత్యాదిదర్శనా ద్విధి రయం ప్రాయికశ్చ వక్తవ్యః)

హల్యస్మిన్నపి దృశ్యతే

కొమ్ముకోనేత్యాది దర్శనా దస్య క్వాప్యప్రవృత్తిః

అత ఉకనుస్య

చిఱుతాదా వుల్లోపః

పోతౌ తద్ధితే

నఖరి పరుషాణాం వికారః

నస్వత్వం గురువిరామబంధాన్తే

ఏకవదేచ

లటిః

సుక్ప్రోకో రన్తా దేకవచనే సేతి వక్తవ్యమ్

పత్యాదా వనుబిన్దో పూర్ణబిన్దు ర్బహుళమ్

పొదరిల్లు, బొమ్మరిల్లు, వాలురమ్ము, పాఱురమ్ము- ఇతి నిపాతసూత్రమ్. కొని పోవోః కొంపోవుః, విజయముచే మోక్షంచేయుః- (ఆగమునే) కర్మణిపత్యశేషుయుచః పూర్ణబిన్దుర్వా.

నాచః

మతా న్నిత్యమ్

అదన్తానాం నిత్య ముంద్వాదయః

ప్రాంతాదే రుత్తరపదే బహుళమ్-(ప్రాంత, లేంత, క్రేవ, పూఁవు, ఆవు) తథా స్యాస్మిన్నితి ప్రయోగతో వేద్యః-సూత్ర మిదంప్రత్యాఖ్యాయ గణసూత్రం కర్తవ్యమ్.

శేషస్య క్రిందోః క్రీ నిత్యమ్

సంగోర్వాదయః-(ముంగాలు, ముంజేయి, ముంగొంగు, ముంగురులు, ముందల)

కొంధూ? కొంజప పూఁబోఁడి

ను క్వరుషేషు

కుతశ్చి ద్ధలో ద్వే

నవాద్ధా త్వార్వ్యాదిషు

ప్రాస్వేద్విర్వచనే హల్యాచ్ఛికస్య

చో హాలి పరసవర్ణః
యస్యాపిదృశ్యతే డప్పి (డుజీ)
ద్రుతస్యాపి లోపో న్యతరస్యామ్.

శేష స్యాంగలోపే అవిశిష్టస్య.
ఋతః షష్ఠ్యా ను ము త్తరపదే.
ఉకః......

## (౩) అజన్తః పరిచ్ఛేదః.

మహాన్తో స్త్రీతిగవ్యాణ్డాః
తద్వి శేషణాని-(అమహద్వ త్ప్రిశాచా ద్యా గ్రహాభూతగణాస్సదా। క్లీబా మిత్రాదయః పుంవ ద్విభాషా మ హదర్థకాః)
క్వాపి వ్యత్యయోపి దృశ్యతే
మిత్రాద్యాః క్లీబాః పుంవద్వా
డుమధ్యలో ప్యుజీః
జీతి బిన్దుః
డుముపులవ స్సుసః
అసో నుః
చేతలోడా గ్సాసః
కువర్ణలో యినాసహా కయీత్యుదీరితో బుధైః-(అయుంతాన న్న సమ్మతః-తథా నహీష్యతే సతా-అయినాస హాక్తోః కయివితినిర్దేశః-అత ఏవ త త్రసర్వాంశమాత్రస్య వశిత్వ మూరీ క్రియతే- సంభూతగ్రహణఫలంతు నకో నివృత్తిరితి ధ్యేయమ్)
కొఱకు కయి జేసః
వలన కంటె పట్టయో జసిసః
కు యొక్క లోపల జసుః
అందు నా జీఘః-(అఙ్సుక్-జీపః.)

నుక్ గ్వాళః-(గ్వాబాదేశస్య నుగాగ మస్య స్యాత్)
ఉవృతో రండా
నుక్సాకో ర్వా
న కయి షష్ఠి యొక్కానామ్
చేతలోడ లోపలానా మస్యస్య లోపః.
ఏకవచనస్య డుమతో వానిః-(ఏక ఇ త్యనుక్తే లటాసహితాదపిస్యాత్ స్వాంగస్య స్వవ్యవధాయకత్వాభా వాత్)
క. దనుజాలయాంవుల వసుఁబుఁడు, దన దిక్కున నునిచినాఁడు తత్కార్య ముక్తె, మనకుం బోవలె నిర్దెస, కనఘా చనఁదీరు నేని యనుగు మ చటికిన్.
ఏః కునువ్రక్రియాణామ్ (ఏః కునువ్రా నా మయుష్మదః)
ఇతోడుజీః నాదేశో నుమతిః
దీర్ఘస్య నామ్నో హ్రస్వః
వృథాయా వా
నపదా ద్యేకాచః
లు జసః
శసాదే ర్బహువచనస్య లట్
ఉలో జడా దేకత్వేనః

దూరాద్ధూతే ప్లుతః
మహాదుల్లో ప్లుత్
నిత్య మార్గ్గిసః
మధ్యమ యోగే వా
నగారో॥
అనుప్రయుక్తస్య లారశో లోపః
హలన్తం స్వన్తం ప్రాతిపదికమ్
అన్త మనున్తతుల్యమ్
అకసర్వనామస్థానమ్
ఇక్చ-(యద్వా అగికా సర్వనామస్థానమ్)
ఋగ్గిలః
దీర్ఘాజ్జిద్వా
మతుపం
ఋత్త్వగాదే రస్
విద్వదాదిమతుపో ర్నిత్యమ్
హ్రస్వో ర్విద్వదాదిత్వం వక్తవ్యమ్
స్త్రీప్రత్యయవిషయస్య స్త్రియాంవా-స్త్రీప్రత్యయం యథానుశాసనమ్-విశేష్యనిఘ్నశ్చ-పుంస్యమహాలో మహాత్మ్యాం స్త్రీవ దాలుః-క్వచిద న్యస్యాపి-వేదాదేః- నిత్యముకః-బల్లిదాదేః- బాహుళికా న్నసమాస్య ని త్యం-మనుమరాలు-భీర్వాదిభ్యః.
దేవశర్మాదే రనుపసర్జనస్య డః
మహాలో భగవదాదే రానఙ్వా
ఆత్మే మనిచోః
పురోధసః
నిత్యం యువాదేః
వేధసః- (అనుపసర్జనస్యకిం- పోషితదే వశర్మండు, మహాత్ముఁడు, మహామహిముఁడు-అక్రోధపురోధుండు, తోరాధితపురోధసుఁడు, ప్రాప్తయౌవ్వం డు, తోషితవేధసుండు, తోషితవేధుండు)
స్త్రీవద్ధః-పుంసి మహాలో బ్రహ్మణః.
పాకృత మప్రయుక్తమ్
ప్రకృతిద్వితయమ్
స్త్రీయాం బల్లిదా ద్యదన్తానో మాలు రనుప్రయుజ్యతే- ఇహాల్భ్యాం చు క్పుకో రుట్- ఆలా వనుప్రయుక్తే.
రాజ్ఞ ఉక్
జగదింద్రజితో ర్లోపో వా
అపయఃప్రభృతే స్సః
నిత్య ముపసర్జనస్య
అత్ర మహాతో నుపసర్జనస్య
అప్సరసామ్
హ్రస్వో రిక్- (హ్రస్వోః-హ్రస్వదివి ఇతిన్యాసః కర్తవ్యః)
నభవదాదే రత్రయోగః
స్త్రీవత్ జీత్

—॥ ఆచ్ఛికాః. ॥—

ఆచ్ఛికా బహవః స్త్రీసమాః
కేచన క్లీబసమాః
బల్లిదాదయః సంస్కృతతుల్యాః
తుకసోని ర్ణుజ్ (మహాతో డుజ్ జీతస్స మాసః అహామతో మతక్)
ఈకాభ్యాం తద్ధతాభ్యాము నిత్యం తద్ధితే- వన్నెకాఁడు, చిన్నెలాఁడి, తద్ధితే కిం, గిన్నెయయుండు, అన్నె లరము.
మహాతశ్చ మగాదేః
క్వా ప్యమహాతః

ఇయస్య పర్నామ్నః (ఇయస్య నామ్నః
 ఏః బహుళగ్రహణం కర్తవ్యమ్)
సస్థి యూదేః
నిత్యం తద్ధితే
ఎడా లేర్లోపః
మాంతో సో నిరుం
కలన్వాదే ష్టేః కుక్
రేనుగోన్వో ర్గజ్
నిత్యం సమాసే
తౌ బహువచనే
లుక్వేన్వాదేః
జామ్వాదే ర్వా
మాడాదే రతః
డలటరా ముతః
కోటేః-(రోటిః)
లడోరద్వియుక్తయో రలఘు ర్గః
అస్యమహతోడ్యక్ మగాదేః
తదేతదో ర్వా
షిత స్తద్ధితస్య
బంధు శ్వశ్రు వాచినో ర్ముకం
నిత్యం లః
డో బహువచనశ్లిష్టస్య
నళో ల్లోడా లలస్య రలోః
అస్యదు మహతో డ్యక్
తదేతదో శ్నిత్యమ్
తేడు జ్నిత్యమ్
అమహతః కాషః (గిజిగాడు)
లోరాల్వాదే ర్ద్వః
ఉపవిభక్తే స్సలోరుణ్వా
డౌపవిభక్తిసలో డుణ్వా
తేః
డ్వానిత్యం లోరః

పగతాదేర్మహతః
పగాత్తుషాత్ రటోతోవా
మహత స్సర్వనామ్నః
కాదలఘుః
అనాగమా త్త్రాషః-(అనాగమాత్త్రాషః
 నిత్య మలఘుః-అతః చూపఱు)
చెయ్యోర్వా
అత స్తద్ధితాత్-(వేటకాఱు)
క్వాపిహలో రలయో రుహ్లలౌ )క్వాపి
 వ్యంజనా ద్రలయో రుహ్లలౌ)
రాగమా న్నిత్యం రోలః

—। సర్వనామాని ।—

అన్నిప్రభృతిసంఖ్యా స్సర్వనామాని
తదాద్యా స్త్రయ స్త్రికః
త్రికస్య తచ్ఛబ్దోనుప విశ్యతే సుపి
ఇత ఏకవ దమహతః (ఇ దేకవ
 దమహ త్త్వే)
సంఖ్యాయా అస్యార్థబాహుళ్యే (అ
 స్యార్థబాహుళ్యే సంఖ్యా)
నిర్ద్విత్రౌ ద్వితీయాదౌ
దు డేకవచనే
దాన దీన దేన ఇతి రూపాణాం కిం
మానం ప్రణేతవ్యమ్
నిలోడుణ్ణన్యతరస్యా మజౌ
మహతోపి జిపః
అనాగమా ద్రటో నిత్యం రిః (అసం
 యుక్తరటో నిత్య మిః)
తదేతదో ర్బహువచనే ర్ణ
నిత్యం వు ట్సుపి
తే స్తత్స్వాజాయా మేకవచనే
ముగ్గురికి నలుగురి కీటి

కొంచెపుబుద్ధులు మానుము, వంచన కపటంబు విడిచి వనజదళాక్షున్
ఉంచుము చిత్తములోపల, నెంచిన మదియెఱుకగన్న యినకులకన్నా.

మనసును బ్రాణము నొక్కటఁ, బనుపడి భ్రూమధ్యమందుఁ బరిణతమైనం
గననగు సంతత బ్రహ్మం, బెనయఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.

కనుదృష్టి లక్ష్యమందున, నెనయించినఁ గాని లేద యెఱుకయు సుఖమున్
వినినంత బ్రహ్మమానా, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా.

అది యిది యనియెడి దృశ్యము, లొదవక నిదమాదివృత్తిలో వెలిఁగెడిస
చ్చిదమృతనిర్మలగగనం, బిది యనరా యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౪౪

కదలక యుండెడి పదమున, సదమలమతి మనసు నిలిపి శాంతాత్ముఁడవై
కుదురొందె బ్రహ్మతత్త్వం, బిది యనరా యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౪౫

మది నాత్మతత్త్వమెఱుఁగుచు, సదమలచిత్తమున బహుళసంకల్పముల
స్మద మణఁచి సచ్చిదమృతం, బిదియనరా యెఱుకగన్న యెఱుగుడికన్నా.

మదమత్సరాదు లుడుపుచు, వదలని గురుపాదభక్తివాంఛాభిరతిం
బొదలుచు సచ్చిద్రూపం, బిది యనరా యెఱుకగన్న యెఱుగుడికన్నా.

మచ్చికమాయల సతతము, ముచ్చటగా నున్నచింత మొనయక నీవున్
అచ్చుపడ గురుని గనుటది, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుగుడికన్నా.

కంతుకము క్రియను సతతము, గంతులు వేయుచును దిరుగు కఠినపుఁ జిత్తం
బంతయు నణఁచినయప్పుడె, గొంతైనను సుఖమటన్న యెఱుగుడికన్నా.

సంచితము తెగును నిలువదు, నుంచిన లక్ష్యంబుమీఁద నుపరతి గన్నన్
మించొకటి కానఁబడు జగ, మెంచఁగ మదియెఱుకగన్న యెఱుగుడికన్నా.

గంగకు యమునకు సందున, సంగతిగాఁ ద్రోవ గనిన సమరస మహా
రంగైన బ్రహ్మపదమున, నింగితమా నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౫౧

బిందువు నాదముఁ గళయునుఁ, బొందుగ సరికూర్చినపుడె పొసఁగును జిత్తం
బందుకొను బ్రహ్మబోధం, బిందున మతియెఱుకగన్న యినకులకన్నా. ౫౨

వింటివి నాదము గ్రక్కున, నుంటివి చిత్సౌఖ్యమందు నుపరతితోడన్
అంటివి బ్రహ్మము నేనని, యింటన్మతియెఱుకగన్న యినకులకన్నా. ౫౩

యమునను నుండెడిచిత్తముఁ, గ్రమమున గంగకును దార్చి కైవల్యముతో
సమనస్కం బొనరించుచు, నమలం బగు నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౫౪

గంగను నుండెడి చిత్తము, సంగతిగా వాణియందు సమరసమై ని
స్సంగత బ్రహ్మము తా నగు, నింగితముగ నెఱుకగన్న యొఱుగుడికన్నా.
గంగను యమునను సతతము, రంగుగ విహరింపుచున్న రమణిని వేగఁ
శృంగాటము నీక్షించిన, నింగితముగ నాదమన్న యెఱుగుడికన్నా. ౫౮
బిందువు నొందిన చిత్తము, నందుకు మూర్ధ్వంబుగాను నమరిన ప్రభతోఁ
జొందించి బయులు గనుచుం, దిందిరతో నెఱుకగన్న యొఱుగుడికన్నా. ౫౭
బిందువుఁ గనుఁగొనినంతనె, యందుకొనుం దిన్నగాన యాపోజ్యోత్యా
పొందున బయలగు విశ్వో, మ్మిందిరకృప నెఱుకగన్న యొఱుగుడికన్నా. ౫౮
కోటరముఁ దాటి వేగము, పాటిల్లుచు నున్న కన్యభావము గనియా
తేటగు నానందం బను, నేట విహరింపు మన్న యినకులకన్నా. ౫౯
చిత్తము నిలుచుట యరుదా, యా త్తఱిఁ జర మచర మెల్ల నీశ్వరుగానే
బత్తిని నత్తిన చిత్తం, బెత్తఱిరా తెఱుగకన్న యినకులకన్నా. ౬౦
దృశ్యము దర్శన మొకటై, నశ్వర మగునిహము మఱచి నాదము గనుటే
వశ్యము సహజానందం, బీశ్వరకృప నెఱుకగన్న యినకులకన్నా. ౬౧
చూపును మనసును నొకటై, ప్రాపించినయంతలోన ఫాలాగ్రమునం
బ్రాపగు ప్రభ కనఁబడునా, యేపున మదియెఱుకిగన్న యినకులకన్నా.
అష్టాంగపూజ చేసిన, శిష్టత నీమనసు నిలిచి శివపద మొందు
స్పష్టమగు దృశ్య మత్తఱి, నిష్టముగా నెఱుకగన్న యినకులకన్నా. ౬౩
మూలపుబంధము నీవును, జాలఁగ బంధించితేని సమరస మారా
తేలగు చిత్తము నంతట, నీలీలను నెఱుకగన్న యినకులకన్నా. ౬౪
శృంగాటమందు సతతము, రంగుగ విహరింపుచున్న రమణిని నీవుఁ
సంగతిఁ బొందుట యరుదా, యింగితముగ నెఱుకగన్న యినకులకన్నా.
చూపులు రెండును నొకటై, ప్రాపించిన లక్ష్యమందుఁ బ్రజఁ గనవచ్చుఁ
దపున నంతట బయలౌ, నీపగిదిని నెఱుకగన్న యినకులకన్నా. ౬౬
కోపము నుబ్బును గర్వము, నేపున దిగనాడి నంత నిం పొనరించుం
జూపునవృత్తికి సహజం, బీపనుపున నెఱుకగన్న యినకులకన్నా. ౬౭
బిందువు నేత్రముమధ్యను, బొందుగఁ గూడుండునట్టి పోఁడిమి గని యా
పొందునఁ జిత్తము నిల్పిన, నిందిర నీ కబ్బు రన్న యినకులకన్నా. ౬౮

తా నని తెలిసిగిన తెలుపే, తా నని మది నిల్పనేని తలఁ పుడిగి తగం
దా నగుఁ బరమానందం, బే నని మది తెలియకగన్న యినకులకన్నా. ౨౨
గురువాక్యము సత్యంబుగ, నిరవొందఁగ నిల్పనేని యిందిర తనకుం
గరుణించి ముక్తిత్రోవను, నెఱిఁగించుర తెలియకగన్న యినకులకన్నా. ౨౩
చిత్తము ప్రీతులు మఱచిన, నత్తుకొనుం దిన్నగానె యానందము, తా
నత్తఱి మఱపగు జగమిా, యెత్తున మది తెలియకగన్న యినకులకన్నా.
మరిగినవిషయము లుడిగిన, నిరవొందఁగ బ్రహ్మబోధ నెఱుఁగఁగవచ్చున్
గుఱిగని విడువుము దానిని, నెఱిఁగినమది తెలియకగన్న యినకులకన్నా.
వాయువు చలనము వాసిన, వాయక యుది కూడె నేని బ్రాపగు మన సా
చాయను గనఁబడు విశ్వము, నీయనువున తెలియకగన్న యినకులకన్నా.
దేహంబు కీడుమేల్లను, దేహికిఁ బ్రాపించి యుండు దేహముతోడ
న్నోహము దిగవిడిచిన యు, ద్దేహంబును జెందుచన్న ధేయుని కన్నా. ౨౪
తన్నెఱుఁగునెఱుక బ్రహ్మము, పన్నుగనాయెఱుకఁ దెల్పు ప్రభుఁడే గురుఁడా
మిన్నగ వారిపదంబుల, నెన్నుచు మది తెలియకగన్న యినకులకన్నా. ౨౫
నిరతంబు బ్రహ్మపదముసఁ, జరియించెడి యోగివరునిఁ జేరుక జగముల్
మఱవక బ్రహ్మము తానా, నిరవొందఁగ నెఱుకగన్న యినకులకన్నా.
జీవత్వ మొందినప్పుడె, భావింపఁగ దేహబాధ పాయకయుండున్
జీవుఁడు సంవిగ్రాహము, భావించిన లేవురన్న భవములు కన్నా. ౨౬
జీవుఁడు చేసినకర్మము, భావింపఁగ దేహమగుచు భంగము నొందున్
జీవత్వ ముడిగి బ్రహ్మము, నీవై విహరింపు మన్న నిజముగఁ గన్నా. ౨౭
జీవుఁడు జగమున మరిగిన, వేవేగమె దేహమెత్తి విహరించునయా
జీవుఁడు తత్త్వముఁ జెందిన, నావెరపున బ్రహ్మమన్న యఱుగుడికన్నా. ౨౮
మారుతము మనసు నొకటై, సారెకుఁ గూడుండెనేని సమరసమొప్పం
జేరును బ్రహ్మపదంబున, నీరీతిని నెఱుకగన్న యినకులకన్నా. ౩౦
అంతర్లక్ష్యమునందున, మంతనతోఁ గూడి నీవు మార్గము గనినన్
సంతతము బ్రహ్మబోధం, బింతేరా తెలియకగన్న యినకులకన్నా. ౩౧
నాసికముకొనను జిత్తము, భాసిల్లును నందు నీదుభావము కుదురై
యాపచెడి నిల్చినంత న, దే సుఖముర తెలియకగన్న యినకులకన్నా. ౩౨

అన్నమయప్రాణమై తగుఁ, జెన్నుగఁ బ్రాణంబువలనఁ జెలఁగును మనసా
పన్నత జ్ఞానం బేకత, మెన్నఁగ నానంద మన్న యినకులకన్నా. ౮౩

నాసికముతుదను జూపులు, వేసారక నిల్చెనేని వేగమె కళకుఁ
డాసును జిత్తం బంతట, నీసున మది మెఱుకగన్న యినకులకన్నా. ౮౪

స్థూలము కనుగొన్నఁదగు, లాలితముగ నాదునాదు లలనయె సూక్ష్మం
బాలోఁగారణ మాప్పై, ద్రైలెడికళ పురుషుఁ డన్న వినరా కన్నా. ౮౫

ఇంద్రియవృత్తులు మనసే, సందడిపడకుండ నిలిపి సమరస మొప్పం
బొందించుఁ దత్త్వమందున, నిందిరకృపమెఱుకగన్న యినకులకన్నా. ౮౬

వృత్తులు బన్నిన మనసగుఁ, బొత్తుగ నొకచోటఁ గూడి పొసఁగిన నెఱుకౌ
నిత్యము దానిని నెఱిఁగిన, యత్యాత్మ నది బ్రహ్మ మన్న యఱుగుడికన్నా.

కొందల మందఁగ నేటికి, సందేహము వీడి నంత సమరస మొప్పం
బొందును జిత్పద మందున, నిందిర నీ కబ్బురన్న యినకులకన్నా. ౮౮

సందేహ మేల వినుమా, పొందుగ నిన్నాళ్లఁ గూడి పొసఁగిన సుఖముం
జెందక విషువము యంతట, నిందిరకృప గలుగునన్న యినకులకన్నా. ౮౯

ఎఱిఁగినపురుషుం డంతటఁ, దిరముగ మఱి యింటనున్నఁ దిరుగుచు నున్నం
బరతత్త్వంబునఁ జిత్తం, బిరవొందఁగ నిల్పురన్న యినకులకన్నా. ౯౦

తనువెల్ల వెనకనేటికి, గనుపాపలనున్నరూపు గనుఁగొనినంత
నిర్వసవస్తు బ్రహ్మబోధం, బెనయించుర మెఱుకగన్న యినకుల కన్నా.

మాయపుజగమున సుఖ మని, యేయెడ విహరించుచున్న నింపొదవదయా
చేయుము గురుపదసేవను, నేయనువున నెఱుకగన్న యినకుల కన్నా.

తనువునఁ బుట్టిన మన మది, కనుఁగొని యది యణఁచి నీవు కాలాంతకునిఁ
గనుసన్న నెఱుఁగ మూర్తిర, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన

ఇంతని విడిచియుంతనె, సంతోషముతోడ మనసు సమరస మానా
చింతలు వీడిన ఫల మిది, యెంతైనను నెఱుకగన్న యినకుల కన్నా. ౯

గంతులు వేయుచు సతతము, నింతులపొంతలను జేర నింపొదవదయా
సంతతము గురుని గనఁదగు, నెంతైనను నెఱుకగన్న యినకులకన్నా.

ఇంద్రియవృత్తులు తానే, సందడిపడకుండ నిల్పి సమరస మొప్పన్
అందెడి తేజము తానే, యుందున మది నెఱుకగన్న యినకులకన్నా. ౯

అంతయుఁ దా నని యుండుము, యంతకు మది నిల్పదేని నంతకు వెలియై
సంతోషమంది నిల్చిన, నంతేరా యెఱుకగన్న యఱుగుడికన్నా. ౯౭

జగమును బ్రహ్మము నందున, జగమందున బ్రహ్మ మందుఁ జెందదు వానిన్
వగవక కనుమిా నీమది, నగణితముగ నెఱుకగన్న యఱుగుడికన్నా. ౯౮

కాయము నమ్మినయంతనె, మాయను హెంత వగుచుఁ జాల మనుతలు గలుగుం
గోయుమి యరిషడ్వర్గం, బీయనువున నెఱుకగన్న యినకులకన్నా ౯౯

కనవలె విశ్వము మన మని, కొనవలె గురుపూజ సేసి కోమలపదముల్
మనవలెఁ జిత్పదమందున, నెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా.

చిత్తము చిత్కళయందునఁ, బొత్తుగఁ గూడుండెనేని బొలఁతుకకృపచే
నత్తదు సంశయ మంతట, నెత్తర యిది యెఱుకగన్న యినకులకన్నా.

యోగము వల్లనె చిత్తము, వేగమె కుదురొంది జ్ఞానవిభవముఁ గనురా
బాగుగ నంతయుఁ దానై, సీగతి మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.

కర్మము గతియే సత్యము, నిర్మల మగునీకుబుద్ధి నిరతము దానిన్
అర్మిలి బెనఁగుచుఁ దిరుగును, మర్మము దైవంబుదాని మనుపురకన్నా.

కర్మమునఁ బుట్టి జీవుఁడు, కర్మము తనతోడఁగాఁగఁ గాలము పుచ్చుం
గర్మవిహీనం బైనను, నిర్మలమగు యోగమందు నిల్పురకన్నా. ౧౦౪

కర్మంబు నిండి యుండఁగ, నిర్మల మగుబోధనొంది నిలుకడఁగను నా
కర్మము విఫలం బైనను, మర్మము గని జ్ఞానసిద్ధి మనురా కన్నా. ౧౦౫

మనసు తిరంబుగ నిల్చినఁ, దనువెల్లను జ్ఞానమయము తలఁగక నిల్చుం
గనుసన్న నీవుగనుమిా, యెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా ౧౦౬

విశ్వం బంతయుఁ జిత్కళ, నశ్వర మగురూప మొంది నయ మెఱుఁగరయా
శాశ్వతపరమానందం, బీశ్వరకృప నెఱుకగన్న యినకులకన్నా. ౧౦౭

కరువలిఁ జూడఁగ బ్రహ్మం, బిరవొందఁగఁ గానిపించి యింపొనరించున్
మఱువక దానినిబొందుట, యెఱుఁగురమది నెఱుకగన్న యినకులకన్నా ౧౦౮

దేహం బంతయుఁ జిత్కళ, యూహింపుము మనసునిలిపి యుపరతి గనినన్
మోహము చెడికనఁబడురా, సోహంబని యెఱుకగన్న సొంపునఁగన్నా ౧౦౯

మనసున వృత్తులు నిలిపెడి, యనువున్నది వినుము నీవు ననవరతంబుం
గనుఁగొని చిత్కళ యంతట, నెనయించిననిల్చురన్న యినకులకన్నా. ౧౧౦

కర్మము చక్కన నైన, న్నిర్మలముగ యోగసిద్ధి నిరతము గల్గుం
గర్మము వితథం బైవ న, కర్మము పొంతను ఫలంబు గలుగుర కన్నా. ౧౧౧

బిందువు నాదము దేహము, పొందుగ నీరెంటి యందుఁ బొసఁగినకళ తాఁ
జెందిన బ్రహ్మము బయలే, యిందిర కృప నెఱుకగన్న యినకులకన్నా. ౧౧౨

వెలయును జ్ఞప్తి యంతటఁ, దలపోయఁగ వేఱులేదు తత్త్వమునందుం
బలుచింతలుడుగఁ దానై, యలఁగఁబడు నెఱుకగన్న యినకులకన్నా. ౧౧౩

చిత్తము చిత్తిఁ బొందిన, సత్తాటి నీమనసు వృత్తి యీసుడిగి తగఁ
హత్తును బ్రహ్మపదంబున, నెత్తెర యిది యెఱుకగన్న యినకులకన్నా. ౧౧౪

మనసును సుస్థిరమైనను, దనువు సదృశ్యంబు నొందుఁ దలఁపుడిగితగం
గనఁబడుఁ దేజం బంతట, నెనయఁగ మది నెఱుకగన్న యినకులకన్నా ౧౧౫

గురుమాని బోధ చెప్పినఁ, బరఁగంగాఁ గర్మసిద్ధి ఫలమొసరించు
న్నిరతమునీమదినుంచుము, యెఱిఁగితివిర యెఱుకగన్న యినకులకన్నా ౧౧౬

కర్మగుణు తెలుఁగుటకునై, మర్మము గ్రహచార మనుచు మార్గము దెలియ
న్నిర్మల బుద్ధులు దెలియుట, యర్మిలి సది తెలివిరన్న యనయముకన్నా ౧౧౭



నడుమఁ గొన్ని తప్పుతెక్కడుగానున్న పద్యములు తీసివేయఁబడినవి. చివరఁ గొన్ని పద్యములు భావరహితములు, సర్థశూన్యములు, కన్నాయని చివరఁబెట్టి రచించిన యితరుల పద్యములు గలవు. అవియునిందుఁ జేర్పఁబడలేదు. కవి పేరు తెలియదు, కన్నయ్యయేమో!

శ్రీరస్తు

# తేరపావనశతకము.

— కర్ణాట తేరపకవి —

## — సీసపద్యములు —

శ్రీపార్వతీసూను సేవించి హరిపాదపద్మములకు మ్రొక్కి భర్గుc దలcచి
శారదాభర్త కంజలిచేసి పద్మను గీర్తించి గిరిజకుc గేలుమొగిచి
పలుకులజవరాలిc దలచి సుపర్ణుని నుతియించి హనుమంతు మతిc దలంచి
వాల్మీకులకు బహువందనంబులుచేసి పారాశరుల నాత్మc బ్రస్తుతించి
సీసపద్యంబులను (జెప్పి వ్రాసి) చెలcగ, శతక మొనరించి నీకిత్తుజగతి వెలయ
ననఘ కర్ణాట తేరపావన నరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర ౧

శ్రీరామపదపద్మసారసంగ్రహమత్తమధుపాయమాన(నన్నాననుcడను)
శ్రీరామనామ విశేష లేఖనసర్త్కాయమానకరాంగుళాంచితుcడను
అమలకర్ణాట (తేరప యనువాcడను) నాంచారమాంబికా నందనుcడను
బ్రాహ్మణాశీర్వాదపాత్రభూతుcడ సూరిసేనవా............
......మనీషులలోపలc బేరుcబొంది, నాcడ నీకృపcగృతిచేసినాcడc గోరి
నన్ను దయcజూడు(విరాకరుణాం)తరంగ, రమ్యగుణసాంద్రదశరథరామచంద్ర!

మొదలc బురాణార్థములు విని తెలుcగను గావ్యనాటకములగతులు తెలుcగ
ఛందాదిలక్షణశాస్త్రంబు తెలుcగను సంధిసమాసోక్తిజాడ తెలుcగ
(భావ)రసస్థాయిభావంబు తెలుcగను వృత్త్యలంకారప్రవృత్తి తెలుcగ
దత్సమతద్భవాంతర్గతాంధ్రమ్ముల భేదమ్ము తెలుcగ సమ్మోద మమర
నీపదధ్యానమున మతి నీకథావ, ధానమునc గైతచెప్పెదc బూని వినుము
అనఘ కర్ణాట తేరపావన నరేంద్ర, రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర 3

నిన్నెఱింగినుతింప నిగమాగమంబులు నేరవు బ్రహ్మాది నిఖిలదేవ
వరులెఱుంగcగలేరు వాచామగోచరచారిత్రుcడవునాcటc గోరి నేను
నిన్నుc బూని నుతింపనేర్తునా నేర నల్లైన నూరక యుండc గాదరమున
నిన్నెన్నc బూనుట నేటికి నావాక్కు చెలcగి పావనముగాc జేయcగాదె
నిన్ను నెన్నని వాక్కులు నిన్నుcజూడ, కన్నుకన్నులు కన్నులాసన్నుతాంగ-యనఘ

శ్రీరామ జయరామ సీతామనోహర కౌస్తుభమణిహార ఘనశరీర
తాటకాంతక పరంధామ కల్పితక్షేమ కామితప్రదనామ ఖలవిరామ
చిత్తగించి మదీయచిత్తము దయనుంచి నాకల్బిషము లోంచి నన్నుఁగావు
నీకన్న నన్నేలిలోక బున్నఁ లేరు పాపంబులను బాప భయము లుడుపఁ
జపలచిత్తుఁడమత్తుఁడశరణుఁడనీచ,వర్తనుఁడనెట్లు ప్రోచెదో(వరద)నన్ను-ననఘ
భానువంశాబ్ధి సంభవచంద్రమా హేమ రమణీయమణిదామ రామ రామ
బలవచ్ఛరౌఘనిర్దళితాసురస్తోమ రణరంగబలభీమ రామ రామ
మౌనిసన్నుతమహామహిమానుభవనామ రక్షితసుత్రామ రామరామ
కమనీయతరదేహకాంతినిర్జితకామ రాజితాభ్రశ్యామ రామ రామ
యాశ్రితాఖిలకల్పకారామ రామ, సామగానక్రి...మరామరామ,యనఘ-
దండంబు నీకు వేదండసంరక్షక దండంబు కంజాతధవళనేత్ర
దండంబు నీకుసన్మౌనిజనస్తుతచర్య దండంబు సంతతౌదార్యధుర్య
దండంబునీకు మార్తాండవంశోద్భవ దండంబు కీర్తిసత్పండితాళి
దండంబునీకుఁ గోదండకాండాన్విత దండంబు బ్రహ్మాండభాండజనక
దండమక్షప్రభంజనోద్దామబాణ,దండముక్షయసాయకాంతరితతూణ-యనఘ-
మారీచదనుజవిదారణాస్త్రపరాకు భానువంశోత్తంస బహుపరాకు
తాటకాసుసమీరదదంశశోకపరాకు పరమపావననామ బహుపరాకు
పాపభంజన జగత్ప్రథితచర్యపరాకు భవపాపమోచన బహుపరాకు
గాధేయసవనరక్షాదీక్షిత పరాకు పాషండమతదూష బహుపరాకు
పవనతనయానుమోదక బహుపరాకు, పంక్తికంధరసంహారబహుపరాకు-
దండంబు ఖండేందుమండనకోదండకాండఖండనబాహుదండ నీకు
వందనం బిందిరాసుందరీపదనారవిందసంగతదృష్టిళింద నీకు
జోహారు దేహాంతదేహవిమోహాభిదాహాభిధాననిధాననీకు
జేజె భూజోద్యాస రాజరాజద్గోత్రరాజకందర వేశ్మరాజనీకు
మ్రొక్కునిక్కుచెవుల్జక్కినెక్కుతూర్పు,దిక్కుదోరనేలువేల్పులదిక్కనీకు-ననఘ-
ఖలునైన దయఁజూచికాతు వన్నందుకు రూపింపగాకాసురుండె సాక్షి
యరిపక్షుఁడనియెన్న కాక్షీకరించుట కనుగతుండౌవిభీషణుఁడె సాక్షి
యాపన్నులగువారి నరసిరక్షించుటకును దండకారణ్యమునులె సాక్షి
హీనున్నైనను జగన్మాన్యుఁజేతు వన్నందుకు గుహుఁడె మున్నుందు సాక్షి
నీవు సర్వజ్ఞుఁడౌటనునిశ్చయించి, మెచ్చి ముద్రికహనుమకిచ్చిందె సాక్షి-

త్రిపురభీకరమహాదేవశరాసనభంగంబుచేసె నీబాహుబలము
క్షత్రకులాంతక జామదగ్న్య * * *
* * * * * * *
నీవైభవంబు
పరశురాముని భంగపఱిచినప్పుడు చూడవలనదా నీరౌద్రకలితవృత్తి
సాకేతపురమహాసౌధాగ్రమునఁ జూడవలనదా నీభోగవర్తనంబు
కన్నుఁగవగల్గినందుకుఁ గాయమందిఁ, ధాత్రిపైఁబుట్టినందుకు దండనుండి॥
కపులనైనిరులుగాఁగ్రకొని వారిచేఁ బనులు చేయించిన ప్రాభవంబు
లఘువుగాఁ గొండతాళ్ళను నీళ్లఁదేలించియలఘుసేతువుగట్టినట్టి మహిమ
మానవాకృతిఁబూని దానవావలి నాజఁ జపివెచిన మహాసాహసంబుఁ
బాదరేణువుచేతఁ బాషాణ మింతిగా నోలిఁజేసిన యింద్రజాలవిద్య
నెవరిదగ్గఱనేర్చితో యెఱుఁగమబ్బ, మాయకాఁడవు నిన్నెన్నమాతరంబె॥
ధీరదరిద్రాంధకారం బడంప నీమంత్రంబు గ్రీష్మార్కమండలంబు
పరుషపాపారణ్యభస్మంబుసేయ నీమంత్రంబు దావాగ్నిమహితకీల
నరుల సంసారాబ్ధిఁదరియింపఁజేయ నీమంత్రంబుదృఢయంత్ర మహితనౌక
ఘోరజాడ్యాహీంద్రవారం బడంప నీమంత్రంబు తార్క్ష్యసమాగమంబు
మహినినీనామమంత్రసమానమంత్ర, రాజమింక లేదుజనులకుఁదేజమొసఁగ॥
తపస్వియై నీనామజపముసేయఁగఁ గదా వాల్మీకి కడు దొడ్డవాఁడు నగుట
చెల్మి నీతోఁ గోరిచేసినందునఁ గదా యినజుండు కిష్కింధ కేలికగుట
దాసుఁడై నీయాజ్ఞ తలకొనిచేసినందునఁగదా హనుమంతుఁడనఘుఁడౌట
మెంచ నిన్నునాశ్రయించినందునఁ గదా యవ్విభీషణుఁడుదీర్ఘాయుఁడగుట
కాకపోయిన వీర లీలోకమందుఁ
జెందుదురె యింతపదవి నిఁక జెండకున్న, నసఘ॥ ౧౧

మీనమై వారాశిలోన డాఁగినసోమకాసురుండను దైత్యు నరసి యందు
వధియించి మించి యవ్విధిచోదితంబుగా వేదంబులనుదెచ్చి విధికినిచ్చి
బీజపూరితమునై తేజరిల్లెడునోడ మునుఁగకుండఁగఁబట్టి మునుపు మనువు
నందుపైనెక్కించి యఖిలలోకంబులుఁ బ్రళయకాలంబునఁ బ్రబలినప్త
సాగరంబులునొక్కటై వేగముంప,నొక్కరుండవుభీతిలేకుందువౌర,యనఘ॥

విబుధు లంబుధి దర్వ విధిపంపునను బోయి మందరాచలము నమందగతిని
బెకలించి నలిమించి తకమకల్పుడు చెత్తుకొనివచ్చి దానిసంతన యెఱుంగ
కంబుధిలో నైవ నది మునుంగంగ దాని నెత్తిపట్టుటకు బత్తేమి లేక
కొండెత్తి మముంబ్రోవు గోవింద గోవింద మాకెవ్వ రిఁకదిక్కు రాకమందు
ననుచు వేల్పులు మ్రొక్కఁగా నపుడు కూర్మ
రూపమునఁ గొండమోయవే వీఁపునందు, ననఘ॥ ౧౭

మును హిరణ్యాక్షుఁ డంచనవొప్పు నొకగొప్పరక్కసుండు తియును క్షమితాణ్ణి
వేల్పుల నని గెల్చి విశ్వమంతయుఁ దానె యేలుచుఁ ధరఁ జుట్టి కేలఁబట్టి
జలధిలోపల నైవఁ జనుచున్నఁ గనివాని వడినాఁచి త్రోవలోపల వరాహ
రూపంబు ధరియించి కోపంబుతో వాని శీర్షంబు గోష్ఠునఁ జిన్నదొన్నచేసి
రణములో మృతినొందించి ప్రణుతి చేసి, వేల్పులెన్నఁగఁ బ్రోవవా విశ్వమెల్ల, నన॥

కడఁగి యంతట హేమకశిపుఁ డంచనువాఁడు హరిమీఁదఁ బగఁబూనియరిగి సకల
దిక్కుల వెదకి తానెక్కడ నాతనిఁ గనలేక వేల్పుల గాసిచేసి
జగము లేలుచునుండి సదమలాత్ముఁడైన ప్రహ్లాదుఁడను పుత్రవరుఁడు పుట్టి
హరిభక్తుఁడై జగంబంతయు హరినిండి యున్నవాఁ డనిన నెందుం డెఁజూపు
మతనిననికంబమున ఁచినసందునృహరి, రూపమునఁ బుట్టి కొట్టవా పాపినతని, నన॥

వినుతింపఁ దగు విరోచనపుత్రుఁ డగుబలి బలవంతుఁడై జగత్ప్రభుతఁ బూని
సత్యధర్మములకాస్పదుఁడునై శాస్త్రోక్త విధి జన్న మొక్కటి వేడ్కఁ జేయఁ
గశ్యపాత్మజుఁ డవై కడుగుజ్జురూపున నాతనిఁ జేరి విఖ్యాతిమీఱఁ
బుడమిమూఁడడుగు లప్పుడు దానముగఁ గొనియఖిలలోకంబుల నాక్రమించి
బలిని బాతాళమున వైచి బలవిరోధి
కఖిలసామ్రాజ్య మీయవా యవని వెలయ, ననఘ॥ ౨౦

భార్గవాన్వయ మతిపావనంబుగ జమదగ్నిమహాముని తపమునకును
శరచాపములు ఖండపరశువుఁ గరముల ధరియించి భూభారహరణమునకు
సంకల్పమొనరించి జగతీతలస్థితరాజలోకము నెల్ల నాజిలోన
మర్దించి మూఁడేడుమాఱులు తచ్చకుశపాణివై పితృగోత్రజులకు
రక్తమునఁ దర్పణము చేసి రౌద్రవృత్తి, భూమికశ్యపునకు ధారవోసినట్టి, యమ్మ
పౌలస్త్యవంశసంభవరావణాదిరాక్షసబాధితామర సమితి దుగ్ధ
సింధుగర్భాంతరసీమభూభృత్కుండలీంద్రతల్పోపరి హేతుభూత

యోగనిద్రారతినుండిన హరిఁజేరి తమపాటు దెల్పిన దశరథాభి
ధానసందనుఁడవై దశముఖు మర్దించి సీతతోఁగూడ సాకేతమందు
నుండుఁ బదుకొండువేలేడు లందముగను,
బొమ్మటంచును రాముఁడై పుట్టితౌర, యనఘ॥ ౨౨

వసుదేవదేవకీవరగర్భమునఁబుట్టి రోహిణేయునితోడ మోహమమర
నందయశోద లానంద మొందఁగ మందఁదోలుచు గోపకులాలి గొల్వ
శకటతృణావర్త బకధేనుకాళింగ కంసాదివైరుల గర్వమడఁచి
పాండవహితముగాఁ బౌరవాన్వయులగు దుర్యోధనాదుల దురమునందు
మ్రందఁజేసి ధరిత్రిపై రామకృష్ణ
రూపములఁ దాల్చితౌర ముకుందపురిరాజ, యనఘ. ౨౩

పరమైనధర్మంబు ధరనహింసయటంచు సకలాగమంబులు చాటుచుండ
హింసాస్పదంబులై యెలమిమీఱు మఖాదికర్మముల్బహుకష్టకరములనుచు
బౌద్ధాగమంబులు పాటించి తత్క్రియ సిద్ధంబుగాఁజేయ బుద్ధిఁదలఁచి
యొక్కింతప్రీతియు లేక యొకరితోఁగూడక యొకరితోమాటాడ కూరకుండి
ప్రజలు చెడుపాటుఁజూచుచు సుజను లెన్న
బౌద్ధరూపంబుఁబూనిన పరమపురుష, యనఘ. ౨౪

కలియుగాంతంబునఁ జెలరేఁగి యవనులు చలపట్టిసత్క్రియా కలితధర్మ
కర్మముల్ నశియింపఁగాఁజేయుచును సాధుజనుల బాధించుచు సంచరించు
వారిపైఁ గోప మవారితగతిఁజేసి వాజిపై నెక్కి దుర్వారఖడ్గ
ధారచే వారలతలలు వ్రల్లఁగనేసి దుష్టవర్తనజాత దోషముడుగఁ
గలికితనమున జగములు గనుతింపఁ, బెంపుదీపింప వెలసినవిమలచరిత, యనఘ.

నాకభూతుఁడవై యనాథులకెల్లను బురుషోత్తముఁడవునై మూఁడులోక
ములు నేలునాఁడవై మునిచిత్తసేవ్యుఁడవై నీపదంబిచ్చు సంతదాత
వై దేవదేవుఁడవై నీవుండఁగా సల్పార్థదుని మానవాధమాధ
ముని గొన్నిపల్లె లేలినవాని బేరుఁబెంపును లేనివాని గాపురుషు నొకని
సేవచేయుటకై కోరిపోవుచుందు, రయ్యయో యెంతమూర్ఖులీయవని మేము, యనఘ.

దేశదేశంబులఁ దిరిగి దుర్జనసేవచేసి దుష్టాన్నంబుమేసి కొండ
లాగ్ల నీళ్లనుడాసి వేళ్ళతోఁ గుజములు పీఁకి వార్ధులు దాఁటి యేకతమునఁ
బుడమిత్రవ్వుచు రాత్రులుబగనిశక్తితోమంత్రముల్చదువుచుయంత్రమూని

శవములమీఁద శ్మశానములోనుండి యూసచేఁ బనులిట్టు లానిచేసి
గాసిఁబొందిననొకగృధ్రిగవ్వమైన, దొరకదా యెమతేమినీకరుణలేక, యనఘ॥
భిక్షమెత్తక తిని బీదమై యొకనాఁడు నది పుట్టకుండిన నంబుత్రావి
పంచతిన్నెలమేను బఱచుక నైత్రోలుగప్పక పడియుండి కుప్పె తనకుఁ
జేదోడుగా నాళ్లు వాదోడుగా నీడ బంధ్రాతుగాఁ గాళ్లు బండిగాఁగ
నూరచావడినుండి కోరుచుండును మహాదేశాధిపత్యంబు తెలివిలేక
మూర్ఖుఁడింతియకాకనీమూర్తిఁదలఁచి, నిన్నుఁబొందెదననఁడుతానింతయైన, నన
పుట్టినప్పటనుండి పొంచి బెబ్బులివలె మునురొప్పుచుండు నీముసలితనము
జాడ్యమై వైరులచందాన దేహంబు బాధించుచుండు విరోధమూని
యేనూలడాగినఁ దా మఱిపోనీక పట్టివేధించు నీపాడులేమి
భిన్నకుటుంబునందున్న వారివిధాన నాయువు దిగజాఱు ననుదినంబు
నేమిసుఖమనుభవించెదరిందుజనులు, వట్టికష్టమె నీవుచేపట్టకున్న, ననఘ.
తీవంచమోములదేవరమనవి మున్నాలించి వేల్పులయులమటలును
విని రక్కసుల మెక్కుదణి పడి తేరులదొరకుఱ్ఱఁడై మునితోఁబోయి
నల్లద్రావుడుమూఁక కుల్లనే సాతని జన్నంబునెఱవేర్చి చని బిఱాన
మినుసికదయ్యంబు మేటివిల్లునుమాడి నేలచూలిని శాళిఁ గేలుపూని
యేలికలమిత్తి బాఁపనిమూలఁద్రోసి, నీమపెన్రొబ్బలుఁజేరవే మో దమమర, నన.
అంతట మీయయ్య మంతనంబున నిన్ను నిలతేనిఁ జేయుట కిచ్చసేయు
నడివిని కైకది నైఁపక నినుఁగాన కంపను దనచూలి నవనినేలఁ
బంపఁ బెన్మిటిని మున్పటిమాట నీటుగా వేఁడిన లే దనఁగూడ కతఁడు
పలవిఁపఁగని నీవు వనికి నయ్యిల్లాలుఁ దమ్ముఁడుఁ దోడురా నెమ్మనేగి
చిత్రకూటాచలప్రాంతచిత్రితోట, జాంతరంబున నుండవే యనుజభక్తి, నన.
గండకవేదండకాండారిఖడ్గశార్దూలభల్లూకాదిదుష్టజంతు
సంతానసంగతసరళతిందుకహరిచందనమందారకందరాళ
ముఖతరూత్తరవనమునిరక్షణాదృతి ఖరదూషణప్రముఖప్రశస్త
దనుజమర్దన భవనునకోపరావణప్రహితమాయామృగప్రహరణావ
సరసమాహృతసీతను వరసికొనుచుఁ, బంపఁజేరవె సుగ్రీవుపంపుసేయ, నన.
వరసమీరాత్మజవచనసంప్రీణిత సుగ్రీవుతోమైత్రి చొచ్చిచేసి
వాలినొక్కమ్మునఁ గూలనేసి తదీయపురికి సుగ్రీవుని దొరనుజేసి

నలుదిక్కులకు వానరుల సీత వెదకగాఁ బంపినవారిలోఁ బవనతనయుఁ
డంబుధిదాఁటి మహారంభమున లంకఁజొచ్చి యచ్చటసీత నచ్చుమిూఱ
నరసిరక్కసులనుజంపిపురముగాల్చి,వచ్చిచెప్పినముదమందవామహాత్మ,యన.
అంతవానరులతో నతిశీఘ్రగతినేగి వారిధితటము నవారితముగఁ
జేరి సేతువుగట్టి ధీరాత్ముఁడై లంక ముట్టడివేయించి మొనసి కుంభ
కర్ణేంద్రజిత్ప్రముఖ్య ఘనరాక్షసులతోడ రావణుఁ బరిమార్చి రావణాను
జన్మునకును రాజ్యసంపద నొనగూర్చి యనలముఖంబున జనకకన్య
నెలమిఁ గైకొని పుష్పకం బెక్కి యోాధ్య
నేలవే తమ్ములనుగూడి యినకులేశ, యన. 3౪

పట్టాభిషిక్తుఁడై దిట్టతనీవున్న యవసరంబున నగస్త్యాదిమునులు
చనుదెంచి నినుఁగాంచి సంతోషమున నెంచి రావణకథలెల్లఁ గేవలముగ
వినుపించిపోయిన వెనుకరాజ్యముసేయుచుండి సీతను వనినుండఁ బనిచి
తురగమేధముచేసి ధరణిలో కవనిజ పోయినపిమ్మటఁ బుత్రకులకు
రాజ్యమిచ్చి సహోదరరాష్ట్రజనులు
గొలువ నిజపురిఁ జేరవా కువలయేశ, యన. 3౫

అంకోలతరువు నయ్యంకోలబీజంబు లెలమితో మున్నాశ్రయించినట్లు
సూచికాజాలంబు లేచి చయ్యన నయస్కాంతోపలంబుతోఁ గలసినట్లు
స్త్రీలనుండిన వృక్షమూలమును జనించి యలరారు తీవె చుట్టల్లినట్లు
సెచ్చోటఁబుట్టిన యేఱులు నీటితోఁ గడునేగి వార్ధిలోఁ గలిసినట్లు
చేరి నినుఁ బాయకుండెడు చిత్తవృత్తి
భక్తియని యెన్నఁబడు మానిపటలిచేత, ననఘ. 3౬

ఉదయంబునకు లేచి ముదముతో నీనామధేయంబుఁ బఠియించుదినముదినము
పరిశుద్ధుఁడైపోయి భక్తితో నీరూపు చూచిసంతోషించుచూపుచూపు
అనువేళలందు నీయాలయంబులు చుట్టి బడిబడివచ్చు నయ్యడుగులడుగు
లవనిసోఁకఁగ నీపదాంబుజంబులక్రొాల దండంబువెట్టినతనువుతనువు
కాకభక్ష్యాన్నములుదిని కడుపునెంచి
తలఁచి నిర్గొల్వకుండినతనువుతనువె, యన. 3౭

క్షాశికాపురిఁ జేరి కాయసంశుద్ధిగా విశ్వనాయకుని సేవింపలేదు
శేషాచలంబు సంతోషంబుగాఁ జేరి వేంకటేశ్వరుని సేవింపలేదు

కాంచీపురంబున కంచితగతిమీఱ వరదరాజును జూడనరుగలేదు
శ్రీరంగనాథుని సేవించుటకు నెంచి శ్రీరంగమును గోరి చేరలేదు
మీఱి నే జేయు పాప మేతీరు నణగు
నీవు తప్పిన నా కెవ్వ రింక దిక్కు, అనఘ. ౩౬

పాప మింకనుసేయ బోకురా యని యనియని బుద్ధిపూర్తిగా నదియె సేయు
నీత్రోవ నరుగరా యిదికష్టతర మని యనియని యాత్రోవ నరుగుచుందు
నీమాటలాడరా యిది మఱి చెడుగని యనియని యామాటలాడుచుందు
నీతిండి దినగరా యిదిదురన్నంబని యనియని యాతిండి దినుచునుందు
నరుడ నిలుపంగలేక దుష్కరపుమనసు
నతని నేరీతి ద్రోచెదో కుతలనాథ, యన. ౩౭

పారంబులేని సంసారాటవిని జొచ్చి దిక్కెఱుంగక నేను బెక్కుగతుల
దిరుగుచు నిది దీని తెరువని యెఱుగక భ్రమియించుచుండుదు భ్రాంతిచేత
నిదిత్రోవ రమ్మని యింపుతో జెయ్యిచ్చి వెంటబెట్టుక పోవ దంట లేదు
నీవు తప్పక నాకు త్రోవ జూపింపుము నాకు నీవె దిక్కు లోకమందు
నెందుకన్నను జెప్పెద ముందు నీవు, దీనరక్షకనామంబు బూనుకతన,నన.

దరుమాద్రిగుహాలలోపలనుండి తరులతాచ్ఛాదితవనకుంజసమితినుండి
యెండలో నెండుచు జండమారుతహతి దూగుచు నీళ్లలో దోగుకొనుచు
వానలో దడియుచు గానలో మిడుకుచు మంచులో వణకుచు జంచలముగ
గొండలపై నేటిదండల గోనల మేనుల నలయించి మించి తపము
చేయ నేటికి దనయింటిచాయనుండి, మనసు నిన్నంట జేసినగాని ముక్తి,యు.

మేఘంబునుండి భూమికి జాఱువన్నధారల రీతి జడలు భూస్థలిని వ్రాల
బాదాగ్రమున నిల్చి పవను నిరోధించి యుపవాసముల మేను నొలగ జేసి
ఖేచరీప్రముఖార్యసూచితముద్రలు చూచుచు దమలోన జోద్యమందు
చుందు రింతియె కాకముందెందు జెడకుండు త్రోవ జూడగ వేరు భావమందు
బొందజేయుచు సచ్చిదానందమయుడ
వైన నీమోక్ష మందరే మౌనివరులు, అనఘ. ౪౦

స్ఫటికోపలమువలె స్వచ్ఛుడౌ నాత్మని గ్రమ్ముకమ్మాయ వికారు జేయ
నతడు తన్మయుడునై యామాయతో గలయిక మనసను కొడుకును మమతమీఱ
గనిపించినంత నాతనయుడు తనతండ్రివలె జగంబంతయు గలయ నిలిచి

రహీనవద్వారపురంబు లన్నియుఁ గట్టుకొని యిరువ్వురాండ్రను దనుపరిగ్ర
హించివారలతోఁగూడి మించి తనకు, దీటు లేరనిగర్వించె దినదినంబు,నన.

ఆయుద్ధతాంత్రలో నాపురాలై ప్రవృత్తనుభార్య మగనితో నెనసియుండు
నెడ తెగకుండ నిర్వృత్తినురె డవభార్య సకృద్భర్తృభావమెుఱఁగి
మెలఁగుచుండును నిట్టు లెలమినుండఁగఁ బ్రవృత్తికిఁబుట్టిరహ్మత తేజులగుచు
మోహకామాదికపుత్రులు పలువురు పిన్నదానికని వివేకముఖ్య
సుతులు పెక్కిండ్ర జనియించి రతుల మతులు
నుర్విపై నిండి మోహాదు లుండిరప్పు, డనఘ. ౭౭

అంతమీఁదటఁ గనిష్ఠాత్ర్మజు లగుచెంచి తాముండ నెలవు లిచ్ఛరింకఁగాను
కన్ని దేశములు వారాక్రమించుటఁ జూచి కడునల్గి వారితోఁగలహమూని
పోరాడి బలిమిచే ధీరులై యొకకొన్ని పురములు విడిపించి భూరిశక్తి
నాడాడి ననియుండ నదియు సైంగకి సైన్యయుక్తులై కామాదు లూరనూర
నెవిఁకీవారలఁబలుముచు విశ్వమంత, తాము మైనిండియుండి రెంతయునదించి॥

కాముండు రతిఁగూడి ఘనసూనశరముల నలయించుచును లోకములఁ జరించెఁ
గ్రోధుండు హింసతోఁ గూడుక నొకరిపై నొకరల్గి పోరాడుచుండఁ జేసె
లోభుండు తృష్ణతో లోలుఁడై యాచుఁ బరులసొమ్ములమీఁద బాళిగొలిపె
మోహుండు భ్రాంతితో ముచ్చటాడుచువచ్చి యుందటికిన్ని పై నాసనిలిపె
నప్పు డేమని చెప్పుదు నవనిలోన, నరులు చెడిభ్రష్టులైపోపుటెరవుమీఁఱ,నన.

ఇది రాత్రి యిది పగ లిది పర్వ మని యెన్న కంగనాలింగితు లైనవారుఁ
గోపంబు చేసినఁ బాపమంచనక యందఱిమీఁదఁ గోపంబు నెఱపువారు
నొకరిసొమ్మెత్తుక నుఱుకరాదనక నందఱసొమ్ము లెత్తుక నుఱుకువారుఁ
బుత్రదారాదికపోషణనిరతులై యెడఁబాయలేక లోనడలువారు
చి చెడిపోయి రెల్లెడవిశ్వమందు, నన॥ ౭౮

వేశ్యాలయంబుల విమలాసవాస్వాదగ ... ... లోఁ
బట్టెమంచము మీఁదఁ బవళించి రాత్రు లిప్పగిది
... ... ... జపమాలపూసలెన్ను
శాత్రవేత్తల మని యుంతే ... ... ... ...
...రులమోసపుచ్చుచు భ్రాంతిగొల్పు, చర్థసంగ్రహమొనరిం రఁ
...రీతి ... ... ... చాగఁజూచి

వస్తువివేకుని వకదిక్కు శాంతుని నొకదిక్కు సంతోష ...
... ... ... చ్ఛియమనియమాదులఁ గ్రమముమీఱి
విద్యాసహాయులై ... ... ... రు
మఱియుఁ దనుగూడిరాఁగ సన్మకముతోవి,
... ... ... జూచి కాముఁడు లోలోసఁగిరఁగఁ దొడఁగె
శాంతుని త ... ... ... ష్టపడఁగె
సంతృప్తుఁడెదురాఁ జనుదేరఁ గని లోభుఁడు ...
దూర బుగాఁజూచి మోహుఁడుభీరుఁడై మూలఁదూఱె,
యఁవలునుముక్తులైరి మున్న దునొంది. ౮౬

తరుసరిపురజంతుపరిపూర్ణమగువిశ్వ మంత యసత్యమం చరసి భోగ
ములు మేఘగతతటిత్తులవలెఁ జంచలం బులునంచెఱింగి య్యౌవనత త్త
లోహంబుపైఁబడి లోలోన నడఁగిన యాయువు తనువులో నడఁగిపోవు
నంచెఱింగియెఱింగి యహికండిగతెముసై భేకంబు దంశవ్యపేక్షఁజేసి
నటులు కాలాహిగ్రస్తుఁడై యజ్ఞుఁడాత్మ
భోగములుగోరుతినపోవుపోకి వెలియ, కనఘ॥

సకలార్థములును నార్జనచేసి మనుజుఁడు దేహంబుఁ బోషించు దినదినంబు
నది దానికేకాక యాదేహికంటదు నతఁడు నిక్కెపుఁడో టాత్మజాను
జాదులేకస్థానజనితులైనను నదీకాష్ఠంబులట్టుల కలసి సంత
కూటంబువలె నుండి గ్రుప్పనఁ దమతమ త్రోవలఁబోదురు తొలుతఁజేసి
కొనినకర్మంబులకు ననుగుణములైన
ఫలములందుచుఁ బుట్టుచుఁ బొలియుచుందు, రనఘ॥ ౮౭

తరుమూలముననుండి జరుగునీడయుఁబోలి సిరి మూలనుండియు జరుగుచుం
నీరుపైఁ గరడు జన్మించి లయించిన గతిఁ బుట్టి వయసందె కలసిపోవు
స్వప్నలబ్ధంబైన వసుసంచయములీలఁ దరుణులపొం దతథ్యంబునొందుఁ
గట్టగాఁ దినఁ దటాకమువాఱిగతి నాయు వల్పమై దినగతి నరుగుచుండ
దలఁప సంసృతి జగతి గంధర్వనగరు
మాడ్కినిమిషములో మాయమగుచుఁ బోవు, ననఘ॥ ౮౮

కేవలాహంకారభావంబుచే నను నాయిల్లు నాసేల నాధనంబు
నాబిడ్డ లని చాల నమ్మి యిమ్ములరక్తి మాంసమజ్జాస్థ్యయుమయము నైన